# ధన్యవాదము.

సుధీమణులారా!

ఆంధ్రశ్రీమద్రామాయణము రచించినపిదప నించుక హనుమచ్చరిత్రము వ్రాయ బుద్ధి పొడమెను. హనుమత్కథనామూలము వ్రాయు నూహ కలుగమి, తద్విజయముమాత్రము వ్రాయనిశ్చయించుకొంటిని. రామాయణమును పురాణముగ జెప్పువారు తఱచుగా రంగనాథరామాయణమునఁగల లక్ష్మణమూర్ఛను విశేషించి తెల్లవాఱుదనుకఁ జెప్పుదురు. అందు హనుమద్విజయకథ పెంచి వ్రాయఁబడినది. కాలనేమి యొనరించినవిచిత్రతపోవనసృష్టి మొదలగుకథలు రామాయణమున నించుకంతయైనఁ జెప్పఁబడలేదు. ఈగ్రంథమును రచించుచుండ స్వప్నమున శ్రీరామమూర్తిగాని శంకరుఁడుగాని హనుమంతుఁడుగాని కనఁబడి "నాయనా! తెలుఁగుభాష నశింపనున్నది. దానినుద్ధరింపఁబూనుము. ఈగ్రంథమును రచింపుము. లేకున్న భాషకు ముప్పువాటిల్లును." అనిచెప్పి కలిగింపలేదు. అట్టిపుణ్యము నేను జేయలేదని నానమ్మకము. ఏవోనాలుగుముక్కలు వ్రాసి దానికొకగ్రంథమని పేరిడి యట్టివి కొన్ని వ్రాసి యిన్నిగ్రంథములు వ్రాసి భాషను పోషించితిని. చూడుఁడని చెప్పుకొనఁ దలఁచినవారిలో నేను నొక్కఁడను గావున నీచిన్నిపొత్తము వ్రాయఁబూనితిని.

ఈపని నారంభింప సుముహూర్తముచూచితి. అప్పుడే బ్ర. శ్రీ. మ. రా. శ్రీ ఆంధ్రవాల్మీకులు వావిలికొలను సుబ్బరావుగారు నాయిల్లు పావనముచేయ నరుదెంచిరి. అచ్చటి పరికరములంబట్టి గ్రంథారంభ మనుమెఱింగి ప్రశ్నింప దాఁపక విన్నవించితి. వారు సంతసించి సంజీవరాయవిజయమని పేరిడి శ్రీమదొంటిమిట్ట కోదండరామార్పణముచేయుమని యాజ్ఞాపించి యొకపత్రముపై నాపేరు వ్రాసి క్రింద "వాసుదాసుఁడు. 2-2-25" అని లిఖించి నాకొసంగిరి. ఇదియే నిరంతరాయముగా గ్రంథపరిసమాప్తికిఁ గారణమని యూహించితి. పిదప సుముహూర్తమున నారంభించితి. కాని పద్యము వ్రాయునపుడు హనుమద్విజయమను వాక్యమే వ్రాయఁబడియె. దానిని మార్పఁబూనక సంజీవరాయవిజయనామాంతరముగల హనుమద్విజయమని వ్రాసితిని.

దీనినే పురాణముగాఁ జెప్పఁబూనినచోఁ గొంత కనుపట్టునేమో యని రామాయణకథను లక్ష్మణమూర్ఛదనుక సంగ్రహముగ వ్రాసితిని. ఆపల

రూఢమగుకథనే యించుక పెంచి వ్రాసితిని. కడపట శ్రీమత్సుందరహనుమన్మం
త్రము వ్రాసితి. అది నాకల్పించినదికాదు. ఆమ్నాయసిద్ధమే యని యెఱుం
గవలయు. తొమ్మిదిదినములకు గ్రంథము పూర్తియయ్యెను. ఇందు నాచేసిన
ఘనకార్య మేమియు లేదు. ఈవిషయము విన్నవించునిమిత్తమే యీగొడవ
వ్రాయవలసివచ్చెను. ముద్రణకార్యము కొనసాగకున్న నీకాలమునఁ గొఱఁత
కలుగకతప్పదు గాననందులకు నాలుకలుచాపుచుండఁగా నాంధ్ర శ్రీమద్రామా
యణోత్సవమునాఁటి కార్యనిర్వాహకసంఘము వారుమిగిలియున్న నూటపదాఱు
రూపాయలు నాకొసంగిరి. తల్లి యక్కగారిపీడచేఁ బదాఱు కర్చుపడియె.
ఆశతము నెట్లో కష్టపడి దాఁచి 1927 సం. మే నెలలో మదరాసున కరిగి
నావృద్ధి కాదికారణమనందగి నాయందు సోదరభావమును గనఁబఱచుచు,
భాషోద్ధరణమే ప్రధానముగా భావించుచు, మూలమూలలఁబడి మూల్గుచున్న
తెనుఁగుగ్రంథముల సంస్కరించి ముద్రించుచు నావంటిచిఱుపేదల కభయ
హస్తమిడుచున్న మ. రా. శ్రీ. వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారితో విన్న
వింప వారాద్రవ్యమునకే యంగీకరించి ముద్రింపించిరి. దీనిని ముద్రింప
నన్నుఁ బ్రోత్సహించి నాయల్పకార్యమునే ఘనకార్యమని సంభావించి
నాయానందమును తమయానందముగా భావించి నన్నాదరించుచున్న సహజ
ధార్మికుల, కడపపురవాస్తవ్యుల, యశోధురంధరుల మ. రా. శ్రీ. విరూరి
పిచ్చయ్యగారిని, కురిడి గుండూరావుగారిని, కౌకూరు శ్రీనివాసరావుగారిని
నిరంతరము స్మరించువాఁడను. కృతిపతి నిర్ణయించి నిరంతరాయముగా
నీకృతి సాగవలయునని యాశీర్వదించిన మ. రా. శ్రీ. వావిలికొలను
సుబ్బరావుగారిని సదా సంస్మరించువాఁడను. అనభిజ్ఞాగ్రేసరుఁడనగు నాతప్పుల
మన్నించి నాకే తెలిపి నాచేతనే సంస్కరింపఁజేయఁ బండితాఖండలులఁ
బ్రార్థించుచున్నాఁడను. ఇంతకన్న విన్నవింపఁదగినవిశేషాంశము లేమియు నాకు
లేవు. ఉపోద్ఘాతములేకున్నఁ బుస్తకమున కేమర్యాద లేదనువారుగల యీ
కాలమున వారియాశయమును మన్నింపఁబూనియే యీధన్యవాదమును నాల్గు
ముక్కలు వ్రాసితిని. నాయపరాధముల మన్నింప సాధుమతుల సదా తల
యొగ్గి వేఁడుచుండువాఁడను.

ఇట్లు విన్నవించు సాధుజనపాదసేవకుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.



శ్రీః

శుభమస్తు.

# శ్రీహనుమద్విజయము.

— ఇష్టదేవతాస్తుతి. —



రంజిల్లఁగ నద్వితీయ మగుచున్
శృంగారవారాశియై
కారుణ్యాకరమై, మనోజ్ఞతమమై
కంజాత్మజాద్యర్చితం
బై రాకాశశివక్త్రమై, యసదృశం
బై వాంఛితార్థప్రదం
బై రాజిల్లు ననంతరామమహా,ము
ద్యద్వాంఛలం గూర్చుతన్. 1

మ. కరుణానీరధి యంచు నాశ్రితలసత్కల్పద్రుమం బంచు ని
ర్జరసంఘైకశరణ్య యంచు మునివర్యస్తోమసంస్తుత్య యై
గరిమన్ మించి సమస్తవేదనుతయై కామాక్షియై పొల్చు నీ
శ్వరిసీతాఖ్యనుబొల్చులక్ష్మిఁగొలుతున్ సర్వేశ్వరిన్ భక్తితోన్.

చ. పరశివుఁడన్న యాహ్వయము భవ్యతమంబయిలోకపూజ్యమై
కర మలరార దీనులను గాచుటయే తనకృత్య మంచెదన్

నిరతము నెంచుచుం గృపకు నీరధి యీతఁడె యంచు శత్రుభీ
కరుఁడితఁడేయటంచునుతిఁగాంచెడుదైవమునాశ్రయించెదన్.

క. తనచిత్తవిలాసమె లో
కనిచయమై యొప్ప వేదగణసన్నుత యై
యనుపమశక్తిం దగు దే
విని గొల్చెద శ్రీపరాంబ విశ్వేశ్వరినిన్. 4

క. శ్రుతులు యథాపూర్వము వ
క్త్రతతిఁ వెడలంగ దేవగణ మెల్లెడ స
న్నతిఁ గొల్వ నెసఁగు కరుణా
కృతిశతధృతి భక్తసుగతిఁ గీర్తింతు మదిన్. 5

క. కరముల వీణాపుస్తక
సరసిజచిన్ముద్ర లలర సాధువితతికిఁ
వరము లొసంగెడు దేవిని
సరస్వతిఁ లోకపూజచరితం గొల్తున్. 6

సీ. శ్రీరామచంద్రాంఘ్రిసేవయే సత్కృత్య
మని నిశ్చయించిన యమలబుద్ధి
సౌమిత్రి గాఢమూర్ఛం బాయ నోషధి
వరములఁ దెచ్చిన బాంధవుండు
ప్రీతిమై రామముద్రిక నిచ్చి భూజాత
చింతఁబాపిన సాధుశేఖరుండు
ప్రాక్పశ్చిమాద్రులఁ బదముల నిల్పి భా
స్కరు నొద్దఁ జదివిన కవివరుండు

తే. జ్ఞాననిధి యనుకంపాబ్ధి స్వామికార్య
తత్పరుండు కృతజ్ఞుండు తత్త్వవేత్త

మారుతాత్మజుఁ డాదృతి మామకకృతి
కృతిని బెంపొందఁజేసి రక్షించుఁగాత. 7

క. ఘనుఁ డంతరాయ తిమిరా
పనోదనార్యముఁడు భక్తపాలకుఁడు హిమా
వనిధారిజాకుమారుఁడు
ననుఁ బ్రోవుత మెపుడు విఘ్ననాథుఁడు కరుణన్. 8

వ. అని యిట్టు లభీష్టదేవతలం బ్రార్థించి కరుణాశరధులయి శిష్యోద్ధారణనిపుణులై చెలంగు నృసింహమహాగ్ని చిద్వేంకటరామదైవజ్ఞశేఖరు లనం బ్రఖ్యాతివహించిన గురువుల వినయంబున వేఁడి వాల్మీకిప్రభృతి సంస్కృతకవులకుం జేమోడ్పు సంధించి నన్నయభట్టారక తిక్కయజ్వప్రభృతు లగునాంధ్రకవీంద్రులపాదారవిందంబులకు వందనం బాచరించి యిప్పటి కవిశిఖామణుల భక్తిమెయిం గొలిచి సమాహితాంతఃకరణుండనై. 9

శా. ఆపద్బంధువు పూతశీలుఁడు సురేంద్రారాతిదుర్వారకు
వ్యాపారప్రతిరోధకుండు రఘునాథాంఘ్ర్యంబుజాతద్వయీ
వ్యాపృక్తాత్మమనోద్విరేఫుఁడు గురుప్రజ్ఞాధనుం డార్తవ్రా
త్తాపధ్వాంతదివాకరుండు సుగుణాధారుండు సూర్యాత్మజ
శ్రీపద్మాకృతి వాయుసూనుఁడుగదా చింతింప నిద్ధాత్రిలోన్.

క. ఆతనివిజయశ్రీయుత
మై తగుచరితంబు చెప్ప నర్హం బగువి
ఖ్యాతం బగుదానికి హృ
త్ప్రీతికరం బైనదాని వివరింతు నిటన్. 11

ఆ. ఎవనిసాయమున నవీనౌషధులు వచ్చె
లక్ష్మణుండు బ్రదికె లలితయశము
రాఘవుండు గాంచె రామాయణగ్రంథ
మిలఁ జెలంగె; నట్టి యలఘుశక్తి. 12

క. మరుదాత్మజువిజయంబును
గరమరుదౌ దానిఁ గీర్తిఁ గ్రాలెడుదానిన్.
వరమతి నభివర్ణించెద
స్థిరభక్తిచెలంగు ననెడుచిత్తము వెలయన్. 13

తే. రంగనాథమహాకవి వ్రాసె మున్ను
దాని నాధారముగఁ గొని మానసమునఁ
దోఁచినట్టులు వ్రాసెద ధూర్తుఁ డనక
కవివరేణ్యులు మన్నింత్రుగాక నన్ను. 14

క. తెనుఁగున శ్రీమద్రామా
యణమును వ్రాసితిని దాని కనుబంధముగా
హనుమద్విజయము వ్రాసెద
ఘను శ్రీరాఘవుఁ గృతీశుఁ గాఁ జేసి తమిన్. 15

తే. ఏమహామతి కంకితమిచ్చెఁ బొల్గి
నాంధ్రభాగవతంబు మహాత్ముఁడైన
పోతనకవీంద్రుఁ డా రామభూమిపతికి
సత్కృపావారిరాశికి సాధుగతికి. 16

క. క్షమయం దేకశిలానగ
రమునన్ విలసిల్లి సుకవిరాజసదావా
సమునఁ దగునొంటిమెట్టను
బ్రమదస్థితిఁ గాంచియున్న రఘురామునకున్. 17

క. అంకిత మొనరిచి మది నిక
లంకుఁడనై జన్మ మిది విలాసముమీఱన్
శంకరమిత్రునికరుణ వి
శంకట సద్వృత్తి నడుపఁజాలు నటంచున్. 18

క. మనమునఁ దలంచి ఘనమహా
జనమంచి కులాబ్ధిచంద్రసంకాశుండై
తన రెడు సుబ్రహ్మణ్యా
ఖ్యునకున్ శ్రోత్రియసరోరుహాభ్యుద్ధ్రవికిన్. 19

క. నిరుపమగుణమణిగణ యై
పరమసతీత్వప్రభావభాసుర యగుచున్
ధరఁ దగు కామాక్ష్యంబకు
సరి తనకున్ లేక వెలయు సాధుచరితకున్. 20

క. తనయుండను లలితాపద
వనరుహసంసక్తచిత్తబంభరుఁ డనుసా
ధునిరతుఁ డను శేషాద్రి య
నునామమున నెల్ల సజ్జనులు పిలువంగన్. 21

క. తమఁ దగి బ్రహ్మాండపురా
ణము లలితాచరిత మమలనయసారంబై
యమరెడు శ్రీరామాయణ
ము మొదలుగాఁగల్గు గ్రంథముల నాంధ్రోక్తిన్. 22

క. వెలయించి రామచంద్రాం
ఘ్రిలలితభక్తుండు నాఁగఁ గీర్తిం గని యు
జ్జ్వలతేజ మ్మొప్పారెడు
ఖలహరుఁ డౌపవనతనయు కమ్రవిజయమున్. 23

క. వ్రాయంగఁ బూని శ్రీరఘు
నాయకుఁ దత్కృతికిఁ దగిన నాయకుఁ డనుచుం
బాయనివ్రానిక యెంతయు
నీయెద నుత్సాహపఱుప నిది తగుననుచున్. 24

## కృతిసమర్పణము.

క. ఓంకారవాచ్యునకు నిర
హంకారునకున్ సురేశ్వరారాధ్యునకున్
బంకరుహాలోచనునకున్
శంకరమిత్రునకు వైరి చక్రహరునకున్. 25

క. కరుణావారాశికి శ్రీ
కరనామున కఖిలమౌనికాంతనుతునకున్
హరిహయపూజితపాదాం
బురుహునకున్ నిగమవినుతపూతాత్మునకున్. 26

క. పరమేశ్వరున కహల్యా
గురుతరశాపోపశమనగుంభితకీర్తి
స్ఫురణునకు దివ్యమూర్తికి
హరికిన్ శ్రీనిధికి దశరథాన్వయమణికిన్. 27

క. ఏకశిలాపురపతికిన్
బాకారిప్రముఖదేవపతిశీర్షధృత
శ్రీకరనామాంకునకున్
బ్రాకటదోస్సారవిజితవైరివితతికిన్. 28

క. ఉపనిషదభినుతమహిమున
కపరిమితాంభోధిబంధనాదృతికి మహా

ర్షిపరివృతపార్శ్వనకుఁ
గపివరపాలునకు జనకకన్యాపతికిన్. 29

తే. అంకితంబుగ నేను జేయంగఁ బూని
నట్టి హనుమద్విజయమున నలరి మఱియు
తమను సంజీవరాయవిజయ మనంగఁ
బరఁగు నీపావనమహాప్రబంధమునకు. 30

వ. కథాప్రారంభం బెట్టిదనిన. 31

# కథారంభము.

మ. బలభేదిప్రముఖాఖిలత్రిదశభవ్యప్రార్థనాలబ్ధని
ర్మలసూర్యాన్వయసంభవుండు, త్రిదశారాతిప్రభుస్ఫారదో
ర్బలవిధ్వంసనసంప్రమోదదవిహారప్రీతచిత్తుండు, రా [న్.
జలలాముండు మునీంద్రవంద్యుఁడలరుఁ జ్మాపుత్రికేశుండిల

శా. మౌనీంద్రుల్ వినుతింపదేవగణముల్ మాప్రాణముల్ కావవే
యోనారాయణ యంచుఁగుయ్యిడఁగనోహో దీనబంధూవిప
న్నానేకప్రియ భక్తరక్షణవిచిత్రానేకకృత్యా! విభూ! [న్.
శ్రీనాథా చనుదె మ్మటంచు సతులుఁ జింతానిమగ్నాత్మల

మ. తనుఁబ్రార్థింపఁగ ధర్మరక్షణనితాంతవ్యగ్రులై భూపతుల్
మనముల్ చంచలతంగనంగ నిఁకనేమాడ్కిఁ ధరఁ ధర్మమెు
య్యన నిల్పుం బ్రజ లెట్లు పొల్తురొ యథాన్యాయంబుగాఁ
బూర్వరీ, తి నటంచుఁ వగఁగుంద మర్త్యజనిఁ జెందెం
గాదె శ్రీనాథుఁడే.

ఉ. రాముఁ డనంగఁ బేరుఁ గని రావణుబంధులఁ జిన్ననాఁడె యు
ద్దామపరాక్రమక్రమము తద్దయు నొప్ప సుబాహుముఖ్యులన్, భీమనిశాచరోత్తములఁ బీఁచమడంచి సుబాహుతమ్మునిన్, దామది నెంచి చంపక సదా గతి నామమహాస్త్ర యుక్తిచేన్. 4

చ. శరనిధిలోఁ బడంగ ఘనసారముఁ గన్పడఁజేసి జానకిన్
హరవరచాపఖండనమహత్తరశుల్కను సంగ్రహించి యా
పరశుధరాంతరస్థనిజభావుక తేజము వే గ్రహించి భూ
సురమును లాశిషంబు లిడ సొంపులఁగుల్క నయోధ్యయందొగిన్. 5

మ. తరుణీరత్నముతోడ నెల్లెడల మోదంబందుచున్ యాచకో
త్కరమందార మనంగనొప్పి జనులంగ మ్రప్రమోదాత్ములం
బరిపూతాంగులఁ జేయుచున్ వెలసి యబ్దద్వాదశస్ఫూర్తిమై
ధరణీశుం డెదహాయిఁ జెందసుగుణాధారుండుపొల్పొంగదున్

చ. కొడుకులునల్వురొక్కటిగఁ గూడి చరింపఁగఁగన్నులారఁ గాం
చెడుధరణీశుఁ డెంద మది చెందెడుమోదము సన్నుతింప నె
వ్వడుపున నేర్చు నాత్రిదశవర్యుని దేశికుఁడే ననంతుఁడేఁ
బుడమి సృజించినట్టి నలువమోముల రాజిలు నావిరించియేన్.

క. అంతటఁ గేకయధరణీ
కాంతుని జూడంగఁ బిల్వఁ గాఁ బడి భరతుం
డెంతయుఁ గూర్చు ప్రియానుజుఁ
డంతికమున వేడ్కఁ గూర్ప నరుదేరంగన్. 8

చ. చనినయనంతరంబ నృపసత్తముఁడొక్కటఁ బౌరులున్ సుహృ
జ్జనులును రాజులున్ మునులుజానపదుల్ సభనిండియుండరా

మున కభిషేకకృత్యమును బొందుగ రేపెయొనర్ప నెంచితిన్
మనమున నెంచి మీర లొకమాటగ సమ్మతిఁ దెల్పనంతటన్.

చ. ఒనరుతు నీమహాంబను చునూహ చెలంగఁగఁ బల్కుచున్న భూ
పుని నయవాక్యముల్ విని ప్రమోదముపొంగఁగఁ బౌరము
ఖ్యులి, ట్లనిరి; క్షమాధవా! సతము హర్షముఁ గూర్చుచు
మమ్ము ధర్మరీ, తిని మెఱయించి ప్రోచితివి ధీరుఁడవై సుర
లద్దిరే! యనన్. 10

చ. అఱువది వేలయేండ్లు నయ మారఁగ నిజ్జగమేలి ధర్మ మె
త్తఱినయినం జలింపని విధంబున మానవు లందు నిల్వఁగా
నెఱె నొనరించినట్టి నృపనీరజవైరివి నీకు సాటియై
వఱలఁగ నెవ్వఁడేఁగలఁడె పార్థివసత్తమ! యెంచి చూచినన్.

తే. అట్టి నీవిత్తఱిన్ జర యాక్రమింపఁ
దనువు కంపింప నుండుటఁ దలఁప నీదు
భూరితర రాజ్యభారము పుత్రవర్యు
నందు నునుచుట ధర్మమార్గానుగతము. 12

చ. అనఘుఁడు రామచంద్రుఁ డభియాతివనోగ్రదవానలుండు స
జ్జనసురభూరుహంబు, గుణశాలి, మహాత్ముఁడు, మానిసన్నుతిం
గనఁదగు సాధువర్తనుఁడు గావున రాజ్యభరంబుఁ బూని చ
క్కనిగతి నేలి నీమది కఖండసుఖంబును గల్గఁజేసెడున్. 13

సీ. ఇంతకాలము నీ వహీనసత్వంబునఁ
బాలింపఁగా నెట్టి బాధలేక
యుండిన మేమిప్పు డుర్వీశనాయకా
నీదు చెంత వసించి నిఖిలసుగుణ

మణిఖని యనఁదగి మహితాత్ముఁ డౌరాముఁ
డిద్ధమార్గంబున నిలను గావ
నీవు చూచుచుఁ గడునెమ్మి నొందెడునట్లి
మేమును గోరుచున్నామటన్న
తే. సజ్జనాలాపముల విని క్ష్మాపతీంద్రుఁ
డంతరంగము సంప్రమోదాబ్ధి నోల
లాడ నట్లె యటంచు వారలరఁ బలికి
యత్న మొగిఁజేసె నభిషేక మాచరింప. 14

మ. పురశృంగారముఁగాంచియచ్చెరువొగింబుట్టింపఁగాఁ గైకదా
సి రఘూత్తంసుని మేలుచూడఁగ నిసీయం చాడు నీచాత్మ
మం, ధర తత్కార్యము కైకకుం దెలిపి చింతం బూనఁగాఁ
జేయునూ, హ రహిం దోఁపఁగ వెఱ్ఱిదానవుగదా యార్యా
మణీ! యిత్తఱిన్. 15

చ. సవతికుమారుభూపతిగ క్ష్మావిభుఁ డిప్పుడు చేయ నెంచె బే
లవుగద నీవు "నాపతి విలాసముగా ననుఁగూడియుండు న
న్నె వలఁచు" నంచుఁ బల్కెదవవెల్లను బొల్లులె కావె సుం
దరీ, యవనివిభుండు రాత్రి నిను నాదృతిఁ గూడఁగ వచ్చి
యుండియున్. 16

తే. ఒక్కపలుకైనఁ జెప్పెనే టక్కుమమత
గనఁబఱచిపోయెఁగాని నిక్కమ్ముపలుక
నోటిముత్యాలురాలునే బోటిమిన్న
యింతయేనియుఁ దెలియవే నేమి యందు. 17

ఉ. రాముని భూపుఁజేసి రఘురాముఁనితల్లికిఁ బెత్తనం బదే
మో మరియాదఁగట్టి నృపుఁడూహయొనర్చెను; దాసివై సదా

రామునితల్లి పంచలను రాణులు నవ్వఁగ మమ్ముఁగూడి యో
భూమిధవాత్మజాత! వగఁబొందఁగ లావు మతేమి చెప్పుదున్.

చ. అన విని కైక మండిపడి యాగతిపట్టునె నాకు నీజనిం
గనియెదఁగాక రామునకుఁ గట్టునె పట్టము భూమిభర్త యిం
కనఁగలదేమొ నాఁగ నిదె గా సమయం బని గూని దాసి యి
ట్లనియెను గంటె విస్మృతిని నమ్మక చెల్లయి దేటివింతయో. 19

చ. సురదనుజాహవంబునను క్షోణివిభుండు భవత్ప్రియుండు ని
ర్జరవరు ప్రార్థనంబున నెసంగెడుశక్తిని బోయి సాయమై
దుర మొనరింప శంబరుని తోరపుఁగోలల మూర్ఛనొందె నో
తరుణిరో! యప్డు సారథియు దానవు తీవ్ర శరాగ్నిఁ ద్రెళ్లుటన్.

శా. నీవేస్యందనవర్యముఁ నడపుచుఁ నేర్పొప్ప దూరంబుగాఁ
బోవం జేసితి వారథంబుఁ బిదపఁ భూనాథుఁ డల్లల్లనఁ
జేవం బూని త్వదీయకృత్యమునకుం జిత్తంబునం బొంగి నీ
వేవేళం దమి వేఁడినఁ వరయుగం బేనిత్తు సత్యంబుగన్. 21

చ. అని వచియింప నీవు మరియాదను బల్కితి విప్పుడేల, వాం
ఛను గనునప్డు కోరెదను సంగర మి ట్లొనరింపఁగావలెఁ
గనుక రథంబు సంగరముఖంబున కేగఁగఁజేయు దాన నం
చనితరసాధ్యశక్తి జవ మూరఁగఁ దోలితి వీవు కోమలీ. 22

ఉ. అంతటఁ జెల్లె నొక్కట భయంకర సంగర, మందు రాక్షసుల్
చెంతల నిల్వలేక రణసీమ తొలంగఁగఁ బాఱె; రాదటం
గాంతుని నింద్రపూజితునిఁ గైకరో నీవాఁగిఁ గూడివచ్చి య
భ్యంతరమందిరంబున సుఖాబ్ధిని దేలితి విద్ధి యంతయున్. 23

ఉ. ఒక్కతఱిఁ గృపాతిశయ మొప్పఁగ జెప్పితి వీవు రాణిరో
మిక్కిలి నీకుఁ గూర్తు నని మేలొనరించినదాన నైతి నీ

చక్కనివార్త నీమదికి జ్ఞప్తికిరాఁగ నొనర్చినందునన్
బెక్కులు మాటలేల గతవృత్తము నీమదిలోఁ దలంపుమా.

క. అని చక్కనియుపదేశం
బును జేయఁగ నట్లు చేయఁబూని కథినవృ
త్తిని దాల్చి కైక జననా
థునివరములఁ గోరి వికచతోయజనేత్రున్. 25

చ. వనముల కంపె నంత రఘువర్యుఁడు కాననసీమనుండ; రా
ట్తనయుఁడు రామభక్తుఁడతిధన్యుఁడు నౌభరతుండు రాము
నిం, గనఁ జని చిత్రకూటమునఁ గాంచి యటన్ వసియించు
సోదరున్, వినయము మీఱ వేఁడెఁ బృథివిన్ భరియింపఁగ
రమ్మటం చొగిన్. 26

చ. పదపడి రామచంద్రఘనపాదుకలం గొని వానియందె భూ
మిదయితతం దగన్ నిలిపి మించు వగన్ రఘురామదర్శనం
బొదవునదెప్పుడంచుదినముల్ గడియించుచునుండె; రాముఁ
డిం, దుఁ దడవుచేయరాదని మునుల్ త్వరపెట్టఁగ దండకా
టవిన్. 27

సీ. జానకీ సౌమిత్రి సహితుఁడై చొచ్చి వి
రాధుని దోలుతో ల్తమ్రందఁజేసి
శాపమోక్షమ్ముఁ బ్రసాదించి యవ్వల
శరభంగముఖమౌనిసత్తములను
దర్శించి వారివాంఛల నెల్లఁ దీరిచి
కుంభసంభవుమ్రోల గూఢరీతి
నలరు వైష్ణవచాప మక్షయతూణీర
ములు మహత్తరశస్త్రములు వశంగ

తే. తము లగుటఁ దేజ మొప్పారఁ దపనవంశ
మౌక్తికం బగురాముండు మహిమ వెలయఁ
బంచవటిఁ జేరి యేకాంతవాస మలరె
నిందటం చెంచుచుఁ వసియించె నెలమి. 28

క. రావణుచెలియలు భయకృ
ద్భావము గలశూర్పణఖయు వచ్చి యొకట నా
క్ష్మావిభుని రూపగరిమము
వేవిధముల వినుతిచేసి విషమశరార్తిన్. 29

క. తనభావముఁ దెలుపఁగ నా
జననాయకు నాజ్ఞఁ బూని సౌమిత్రియు దా
నిని నాసాశ్రుతి హీనఁగ
నొనరిచె; న త్తన్వి ఖరునియొద్దకుఁ దవ్వరఁగన్. 30

క. పరుగిడి పరాభవంబును
ధరణీపతి యుండుచోటుఁ దాఁ దెలిపిన నా
ఖరుఁ డప్డె సైన్యయుతుఁ డై
దుర మొనరింపంగ నేగె దుష్టాత్ముండై. 31

ఉ. అంతట రాఘవుండు ప్రళయాంతకుభంగిని బ్రజ్వరిల్లి దు
ర్దాంతఖరాదిదైత్యసముదాయము నొక్కముహూర్తమా
త్రలో, వింతగఁ గూల్చి జానకియు వేగమ లక్ష్మణుఁగూడి
వచ్చి య, త్యంతముదంబునం గనఁగ నాదృతి నూఁఅడిలంగఁ
బల్కుచున్. 32

చ. తనఘనవీర్య మాధరణి దాఁటి దివంబున వెల్గఁజేయుచుఁ
మనుకులమండనుండు మునిమండను లెంతయు గారవింప న
వ్వనమున గౌతమీసలిలభవ్యవిభాగములందు స్వేచ్ఛనుం

డెను దనచెంత నున్నసతినిర్మలచిత్తమునం జెలంగఁగన్. 33

ఉ. అవ్వల రావణుం గనఁగ నంబుధి దాఁటి వికారరూపమే
యెవ్వని నైన జాలిఁ గొని యెంతయు దుఃఖపడంగఁ జేయఁ
గా, నవ్వసుధాధిపాత్మభవు నాశ్రితరక్షకు రామచంద్రు నే
నెవ్విధి నేమృతిం గనఁగ నిప్పుడె చేసెద నంచు నెంచుచున్.

చ. చని చని లంకలో దనుజసంఘము లెల్లెడఁ గొల్వ నున్నతి
ఘనసభరత్నపీఠమునఁ గ్రాలెడు నన్నకు వందనావళుల్
పొనరిచె; నంత నాసికయుఁ బోవ శ్రుతుల్ గనరాకయుండ
న్నన్ననిజసహోదరి దనుజనాథుఁడుగాంచిభయంక రార్భటిన్.

చ. పటపటఁబండ్లుగీటుచు సెబాసుర! యోసురనాథ! చేసి తే
యిటు లవమాన మీసతికి నింక దివంబున నుండుఁగాని నీ
దటుకున ద్రింగువాఁడ నని తన్విని గాంచి సహోదరీ నిను
జటులపరాక్రమంబున నసంగతనాసికఁ జేసె నెవ్వఁడో. 36

చ. శ్రుతులను గోసి యేజనుఁడు క్షోణి సజీవుఁడు గాఁ జరింపఁ
గా, మతిని దలంచె? నీ జెనకి మానిని! యెవ్వఁడు శర్మ
మొంద సం, తతమును గోరె? నేజడుఁడు దారుణపన్నగ
భూరిభోగము, ద్ధతి మెయిఁ బట్టి ముద్దుగొనఁ దాఁదలపోసె?
నెఱుంగఁ జెప్పుమా. 37

చ. అరిజనకాలతుల్యుఁడు మహత్తరదోర్బలశాలి నిర్జరే
శ్వరఘనగర్వశాంతికరసత్వవిలాసుఁడు సింహవిక్రముం
డురుతరకీర్తిసంవృతదిగుత్తమభూరికరీంద్రకుంభుఁ డీ
శ్వరవరవర్ధితుండు, గుణశాలి దశాననుఁ డంచు నుంతయున్.

క. తలపోయక నీ కిట్లే
ఖలుఁ డవమానంబుఁ గూర్చెఁ గడువడిఁ జెపుమా

పలుమాట లేల వానికి
నిల నాయువు తగ్గె ననుచు నెన్నుము మదిలోన్. 39

మ. సురలుం గిన్నరు లాశరప్రముఖులున్ శోభిల్లు యక్షాధిపుల్
ధరణీశుల్ ననుఁ గాంచినంతనె యముల్ దర్పోద్ధతిన్ మిం
చఁగాఁ, జరియింపం జనుదెంచి నట్లరయుచున్ జంచత్పదాం
భోజముల్, కర మర్థిం గొలువంగఁ బూనుదురు నిక్కం
బిద్ది యిక్లే ననున్. 40

చ. తెలియక యెవ్వఁడో యవమతిం గనఁజేసెను నిన్ను దీనిచేఁ
గలుగుఫలం బిదంచు నెఱుఁగండు, స్వకీయపరాక్రమంబు నే
వెలువడఁజేయఁ బూనెఁ గడువెఱ్ఱి యతం డని తోఁచెడున్
మదిన్, గలుగునెవానికిన్ బ్రదుకఁగాఁ బరిరక్షయొనర్పువాఁ
డిలన్. 41

క. కలఁగనిమదితో నంతయు
లలనా వినిపింపు మవ్వలన్ రావణుఁ డే
పలరం జేయంగా మదిఁ
దలఁచినకార్యంబు నీవు తగఁ గందువు సూ. 42

చ. అని పలుకంగ నస్ఫుటము లై తగునక్షరముల్ గలట్టి రీ
తిని ధరణీకుమారి దగుదివ్యతనూరుచిరత్వ మూమె నా
ఘనిఘనవీర్య మాశరులఁ ద్రుంచుటయున్ వివరించి చెప్ప
శూ, ర్పణఖవచస్తతిన్ వినికరంబుభయం బెదనంకురింపఁగన్.

చ. కనఁబడకుండ దాఁచుచు నికామపరాక్రమ మొప్పునట్లుగా
దనుజవరుండు సోదరిముదంబును బొందఁగ మాటలాడి వే
చని యల దండకాటవిని సాధ్వస మూనినతాటకాసుతుం
గని తనరాకఁ జెప్ప విని గాఢభయంబునఁ బల్కె తొట్రిలన్.

శా. మారీచుం డిటుపల్కె; రావణ! జగన్మాన్యుండు రాముండు వృ, త్రారిన్ మించును విక్రమంబున, మహాస్త్రాస్ఫారతీవ్రాశుగా, సారంబుం బరఁగించి త్రుంచు రిపులం జండాహవక్షోణిదు, ర్వారుండై లయకాలురీతిఁ దగుఁ జూ వర్ణింప నింకేటికిన్.

ఉ. రాముని పేరు విన్నయెడ రాక్షసులెల్ల వడంకుచుంచు రా భీమపరాక్రముం దోడరి విక్రమసంపదఁ జూపఁ జాలు వాఁ డీమహిఁ లేఁడు స్వర్గమున నింకను గల్గు జగద్విజంబునం దేమఱకుండఁ జూచిన నదెందును గల్గఁడు పో ధ్రువంబుగన్.

ఉ. చాలును నీప్రయత్న మిది చావును గూర్పఁగఁ జాలు రావణా, పోలఁ దలంపు మిట్టి పని పోలదు చేయ నటంచు స్వాశయం, బోలి వచించువాఁడ వినుమో దశకంధర! స్వానుభూతిచే, నేలినవాని మ్రోల వచియింపఁగఁ జాలితి శాంతమూనుమా. 47

చ. సురలు నిశాచరుల్ మిగుల శూరులు గాఁదగు భూమిపాలకుల్, గరువము మించ నొప్పు వసుకాండము రుద్రులు ద్వాదశార్కులున్, సురపతియుం ద్రిమూర్తులును జొక్కపు వేడుకఁ గూడివచ్చి సం, గరమున రాము మారుకొనఁగా భయ మొందుదు రేమిచెప్పుదున్. 48

ఉ. చిన్నతనాన యజ్ఞమును జేయఁగఁ బూనిన కౌశికుండు తన్ మన్ననఁ దోడితేర నొకమార్గణ మేసి సుబాహుఁ జంపె నే మన్న నిఁ కేమిలాభ; మభియాతిలయాంతకుఁ డైనరాముఁ డం, త న్ననుఁ బావకాస్త్రమునఁ దక్షణమే పడవైచె నంబుధిన్. 49

ఉ. అప్పటివార్త యిద్ది మది యందు స్మరింపఁగ భీతిగల్గఁగా

నిప్పుడు జేయుచున్నయది యేమని పల్కుడు? దానవాధిపా!
ముప్పు తొలంగెనంచును సముద్రపుటొడ్డున నిందు నిల్చియే
యిప్పునిఁ బూనినాఁడఁ దపమియ్యది సాగుచు నున్న దెట్టులో.

ఉ. ఏతరుణంబునందొ శ్రుతు లేర్పడ రేఫముఁ గూడుశబ్ద మె
ట్లో తగ విన్నమాత్రమున నూహ కలంగఁగ బుద్ధియందుఁ
బెక్, భీతి జనించుచుండు నొకవింత వచించెద నాలకింపు
నా, చేతము రాముఁ డన్న రఘుసిద్ధుఁడె యన్న రఘూద్వ
హుం డనన్. 51

సీ. రథమన్న రవమన్న రమ్యస్వరంబన్న
రత్నమన్నను రాజరాజటన్న
రంభోరు వన్నను రణమన్న రఘువన్న
రమణియే యన్నను రజతమన్న
రయమన్న రమయన్న రాజీవమని యన్న
రక్కసి యన్నను రంధ్రమన్న
రంహస్సనక్ మఱి రక్తమన్నను రక్తి
రక్షణము లనిన రచన యన్న

తే. రజనియన్న రజస్సన రజ్జు వనిన
మఱియు నేదేని రేఫాదిమ మగుశబ్ద
ముచ్చరింపఁగ జెవిఁ జొర నురుభయంబు
గలిగి బుద్ధియు నూటాడుఁ బలుకు లేల. 52

మ. వినుమీ రావణ! విశ్రవస్తనయుఁడక్ విఖ్యాతినిం గాంచి చ
క్కనిపాండిత్యము గల్గువాఁడవనిసర్వత్రం బందునుం గీర్తిఁగాం
చిన నీకేటికొ యిట్టిబుద్ధి పొడమెక్ జేయంగఁ గీడొందు నీ
పనినిక్ మాని పురంబుఁ జేరుమనివాక్యారుష్య మేపారఁగన్.

మ తను నింతేనియు లెక్కపెట్టక నితాంతస్ఫారధర్మోక్తులన్
వినిపింపంబనిపూనియింకను మహోద్వృత్తిన్ వచింపంగఁబూ
నినమారీచునిఁ గాంచి భ్రూకుటులు తన్ నిర్ఘాతశంకాత్ముగా
నొనరింపం గ్రుధమాట తొట్రిలఁగ నోహోయంచు గర్జిం
చుచున్. 54

శా. దేహం బెల్లఁ జెమర్ప నోష్ఠములు సందీప్తంబులై యేవియే
నూహల్ చేసెడిమాడ్కిఁగా వడఁక నత్యుగ్రంబులై నేత్ర
ముల్, బాహువ్యూహము వేఱురీతిఁ గన దుర్వ్యాపార
పారీణుఁడై, వే హుంకార మొనర్చి యంతకు మహోద్వృ
త్తిన్ విడంబించుచున్. 55

శా. ఏమేమీ వరధర్మపద్ధతుల నీవేనేర్చితో రాము ను
ద్దామాస్త్రప్రకరం బెఱుంగ నీఁక నేతద్విశ్వమం దేరికే
నోమారీచ! యశక్యమో యతనితో నుద్ధీతఁడం చాడఁగా
నేమాన్యుండును లేఁడొ యద్భుతమిదా నింకేమివర్ణించెదో.

మ. తులువా! పాప మటంచు నున్ననను నీ తుచ్ఛోక్తులన్ దూ
ఱెదే, కలయం జూడుము నన్నుఁ గ్రోధమున న క్కాలాంత
కుం జంపఁగాఁ, గల నిప్పట్టున నీనుడుల్ విని భయోత్కం
పంబునుం గాంతునే, పలుమాటల్ పనిలేదు నాదుపనిఁ దీ
ర్పం బూనెదో మానెదో. 57

చ. కను మిదె చంద్రహాసము నికామము నాఁకలిగొన్న దిప్డు నీ
తనువును దీని కాహుతిగ దైవగతిం బొనరింతువో మదు
క్తిని నెఱవేర్చి జీవనయుతిం గనువాఁడవో చెప్పు మెద్ది నీ
మనమునఁదోఁచునన్న క్షణమాత్రముమౌనసమాధినిష్ఠుఁడై.

చ. ఇటులు తలంచె, నీదనుజుఁ డెంతయు దుష్టుఁడు చంపితీరు; నే

నటఁ జని నీఁడు చెప్పినటు లారఘుభూపతి కిద్ధశ క్తికిం
బటుకపటంబుఁ బూనియె యపాయము గల్గఁగఁ జేయువాఁ
డ నేఁ,గటుశరవహ్ని నీతనువుఁగాల్పక నూనఁడిఁ కేమిచేయనౌ.
చ. అని తలపోసి దాశరథిహ స్తవిము క్తశిలీముఖంబుచే
తనె మృతిఁగల్గ మేలగుపదంబున వాసము చేయఁగల్గు నీ
దనుజునిచేతఁ జచ్చుటయుఁ దథ్యముగాఁ దలపోయఁబాపమే
యని మదినిశ్చయించి దనుజాధిపుఁజూచి వినీతుఁడై యనున్.
ఉ. రావణ! న్యాయమే యిటు కరంబు క్రుధం దగి మాటలా
డఁగా, భూవరుశ క్తి యిట్టిదని పోలఁగఁజెప్ప భయంబుఁ
గాంతువో, ధీవిభవంబుఁ గాంచి యతితీవ్రపరాక్రమమొప్పఁ
జూపుదో, నీవని యిట్టులాడితిని నేరముగా గ్రహించు
టొప్పనే. 61
ఉ. దానవనాథ! నీపనుపుఁ దప్పకచేసెద మ స్తకంబునన్
బూనుదు నీదునాజ్ఞ రఘుభూపుని కేమపకార మిప్పుడే
నే నొనరింపఁగాఁదగునొ నీమది నెన్ని విధింపు మవ్విలం
గానఁబడున్ మదీయకృతి కన్నులపండువు చేయఁజాలుచున్.
చ. అన విని యట్టె నవ్వి పరిహాసము నీవిటు చేయఁ బాడియే
మనమున నున్న యుమ్మలిక మ్రాన్పడఁ జేయఁగ నేమియంటినో
దనుజవరేణ్య! వేఱొకవిధంబున నెంచక యుద్ధరింపుమా
యని కడువేఁడి చేయఁదగు నప్పని చెప్పఁగ నాలకించుచున్.
క. మాయాకురంగమై చని
యాయాశ్రమమందుఁ దిరిగి యవనీజాతన్
వేయాసపడఁగఁ జేసెను;
మాయ యటం చెన్నెఁ దనదుమది లక్ష్మణుఁడున్. 64

చ. అనుజుఁడు చెప్పినట్టిహిత మంతయు రాముఁ నిచిత్తమందు
న్నా, జనకజయాశయం బొలయఁజాలఁగ మన్ననఁగాంచదె
య్యె; వే, ధనువు గ్రహించి యంబకవితానములం గొని
భార్యఁ గాంచు న, ప్పని యలతమ్మునందు నిడి పాఱెడునాహ
రిణంబు వెంటనే. 65

చ. పరుగిడె; నంతనాహరిణవర్యము దూరము గొంచుఁబోయియె
క్కరణిని జిక్కకుంట రఘుకాంతుఁడు క్రోధము తన్ను ముం
ప భీ, కరశర మేయ నామృగము కాలునివీటికిఁ బోవుచుండి
కం,తరవము రాముశబ్దమువిడంబము చేయఁగనోయితమ్ముఁడా

తే. ప్రేయసీ! జానకీ! యంచు విశదరీతిఁ
బర్ణశాలను వినఁబడ భావమందు
దైన్య మొక్కటఁ బుట్టంగఁ దవిలి యరచె;
దాని విని లక్ష్మణుం గాంచి జానకి వగ. 67

క. చనవయ్యా రామురక్షణ
మొనరుపఁదగునట్టికాల మొదవె నటంచున్
మన మడలఁ బల్కె లక్ష్మణుఁ
డనునయ మలరంగఁ బల్కె నవ్వాక్యములన్. 68

చ. వినక కఠోరవాక్కుల వివేకము మీఱఁగఁ బల్కె లక్ష్మణుం
డనియెను దల్లిరో విధి యిదంతయుఁ గష్టముపాలు చేయఁ
బూ, నినయటుతోఁచెఁ బోయెదను నీవిభుఁ జూడఁగ నంచు
నేడ్పుతోఁ, జనియెను; రావణుం డపుడు సాధుతనుద్యుతి
వెల్గుచుండఁగన్. 69

సీ. సన్న్యాసివేషంబు చక్కనిరీతిగా
ధరియించి వచ్చి యాధరణితనయ

సద్ధూర్తమును గుణసంపత్తి వర్ణించి
తనమోహమును దెల్పి దారుణతను
వట్టె కన్పడఁజేసి యామె యాక్రోశింపఁ
గొనిపోవుచుఁ ధర్మమునకు బద్ధుఁ
డయివచ్చినజటాయు వనుపక్షి వధియించి
లంకకుఁబోయి యా పంకజాక్షిఁ
తే. జార్వశోకవనంబున సాధ్వసంబుఁ
గలుగఁ జేసెడి రాక్షసాంగనలనడుమ
నునిచె; వారెల్ల రావణు నొగి గ్రహింప
బోధచేయుచు నుండి రెప్పుడు వదలక. 70

చ. అనవిని రామమూర్తియు మహాసురుఁ డొక్కని మేషమా
త్రలోఁ, బడునటుచేయఁగాఁ దగిన బాణము వైచి యతం
డు చచ్చున, ప్పుడు దనకంఠనాదముగఁ బొల్చెడుభంగిని
లక్ష్మణా! కటా, పుడమిసుతా! యటం చఱచె భూసుత దీనిని
విన్నచో వగన్. 71

చ. తనకయి యెంతగాఁ గలఁగి తాపము నొందునొ యెట్టు లుం
డునో, యని తలపోసి వే మరలి యాశ్రమసీమకు వచ్చు
చుండఁగా, ననుజుఁడు కానరాఁగఁ దగునయ్యమహాటవి సీత
నొంటిగా, నునిచి యి ట్లెట్లు వచ్చితివాకో తెలియంగను జాల
నుంతయున్. 72

చ. మనసు కలంగెడిక్షిఁ దిటవు మాటలనుం గన రాదు తమ్ముఁడా
వనితగదా మహాటవిని బాధలఁ గూర్చెడుసత్వముల్ మహా
దనుజులు నుందు రంచు నిటఁ దన్విని నొంటిగ వీడిపోవరా
దనుచుఁదలంపవైతివి మహాపదరాఁ దగునంచుఁ దోఁచెడిన్.

క. అని పలవించుచు దూఱుచు
ననుజునితోఁగూడి యాశ్రమావని కేగన్
జనకజ లేకుండెను రా
మునిచిత్తము వ్రక్కలయ్యె ముఖరుచి తఱిగెన్. 74

క. పలవించుచు సోదరుతోఁ
గలిసి యరణ్యంబు వెదకి కానక యొకచో
విలయకరుఁబోలి భూతం
బుల మ్రింగెడుదనుజు నొకని భూరితరాంగున్. 75

క. కనుఁగొని యాతం డీష్వం
గను లక్ష్మణుఁడార్తినొందఁగా రాఘవుఁడా
తని భీతిఁ బాపి కరయుగ
మును ద్రుంచెను దమ్ము సాయమునఁ బూనికతోన్. 76

క. ఆతఁడు చెప్పిన చొప్పున
నేతాపసివేష మూను నింతిని శబరిం
జేతోనియమం బొప్పఁగఁ
బ్రీతిం గనఁజేయఁ జూచె వేడ్క వనితయున్. 77

క. పంపాతీరాటవులన్
సొంపునఁ దగుసుఫలములను జొక్కపుభక్తిం
గంపించుహస్తములను ని
లింపులు సంతోషపడఁగ లీలామనుజున్. 78

క. శ్రీనాథుని రఘురాముని
మౌనీంద్రసమర్చితపదు మహిమాఢ్యుని సీ
తానాయకుఁ దృప్తిం గనఁ
దా నొనరిచి ధన్యయయ్యెఁ దత్సమయమునన్. 79

క. రాముం డంతట శబరికిఁ
దా మోక్ష మొసంగి పంపదాపున కేగెన్
సౌమిత్రితోడ నచ్చట
ధీమహితుఁడు హనుమ భిక్షుదేహయుతుండై. 80

క. తపనాత్మజుండు తనను బ
నుప వచ్చెను మైత్రిఁ గూర్పను దగు ప్రతిభతోఁ
దపనాన్వయుండు నాహను
మపలుకులన్ విశ్వసించుమాడ్కిఁ బలుకుచున్. 81

క. హనుమంతుని మూఁపులపై
ననుజునితో నెక్కిపోయి యలసుగ్రీవుం
గని మైత్రి చేసి యాతని
మనమునఁ గలసంశయముల మానుగ నెఱిఁగెన్. 82

సీ. తనశక్తి సంశయతతులను దొలఁగించి
యింద్రతనూజుని నేపడంచి
తద్రాజ్యపదమునఁ దపనుజు నెక్కించి
యంగదు యౌవరాజ్యమునసుంచి
వనచరవరులను వరుస నల్దిక్కుల
జనకజ వెదకంగ సాగనంపి
హనుమచేతికి స్వనామాంకితరత్నాంగు
ళీయక మిచ్చి తాఁ జేయఁదగిన
తే. కార్యముల జానకికిఁ జెప్పఁగాఁ బనిచిన
హనుమ యంగదముఖులతో నరిగి యందు
సీతఁ గానక సంపాతి చెప్పినట్లు
సంద్రమును దాఁటి లంకలో సరగ వెదకి. 83

క. జనకజఁ గానక శోకా
ఖ్య నెగడు నుద్యానవనము నందుంగని యా
మెను మోదమందఁజేయం
గను జాలినరామముద్రికను దమి నిచ్చెన్. 84

క. కని దాని నతని శ్రీరా
ముని దూతగ నమ్మి రామమూర్తియు నమ్మం
గనుజాలు రత్నభూషణ
ము నిచ్చి తనవార్తచెప్పి ముదమున ననుపన్. 85

మ వనభంగం బొనరించి యక్షముఖులన్ బాహాబలం బొప్పఁగా
ననిమ్రందించిమహేంద్రజిత్ప్రహితవిధ్యస్త్రంబు చేఁజిక్కి యా
దనుజేంద్రుంగనఁబోయిబుద్ధిగలుగం దత్త్వోక్తులం బల్కి యా
తనికోపంబునకెంతొలక్ష్యమగుచున్ దర్పంబునిండారఁగన్.

క. తనతోఁకఁగాల్చు నద్దను
జనికరమును జంపి లంక సరగున మండం
గను వాలాగ్నికి నాహుతిఁ
గను జేయుచు మఁగిడివచ్చి కంధితటమునన్. 87

క. తనమిత్రవనచరుల నొ
య్యనఁగూడి కపీశుఁ గాన నరుగుచు మార్గం
బున మధువనమునఁ బొలకు
ననుమతిఁ గొనకుండఁ జొచ్చి యటఁ దేనియలన్. 88

ఆ. తనివితీఱఁ ద్రావి దధిముఖు నదలించి
యతఁడు కపిపు కడకు నరిగి తెల్పి
యతనియాజ్ఞఁ దెలుప నందఱు నరిగిరి
హనుమ కుశల మవనితనయ కచట. 89

ఆ. అనుచుఁ బలికి రాముఁ డడిగిన ప్రశ్నము
లకు సదుత్తరంబులను వచించె
నంతఁ దపనపుత్త్రుఁ డాజ్ఞ చేయఁగఁ గపి
బలములెల్లఁ గదలి వార్ధికడకు. 90

క. పరుగిడె; నంతట శ్రీరఘు
వరుఁ డంబుధితీరమందు భవ్యనియమముౝ
గరమరుదుగఁ గొని వేఁడెను
సరిత్పతీ! నిన్ను దాఁటుచందము చెపుమా. 91

క. అని పలుమఱు వేఁడిన నా
వననిధి పలుకకయె యుండె; బహుమానము గ
ల్గిన రాముఁడు కోపంబున
ధనువును గ్రహియించి వేగ దర్ప మ్మలరన్. 92

క. అసుసంతతి భక్షించుచు
వెసఁబాఱెడు నిశితతీక్ష్ణపృథుశరమును గూ
ర్చి సమంత్రకముగ వైవం
గ సమయ మిదె యనుచు నెంచఁ గా భీతుండై. 93

క. సరిదధిపతి కీలాలాం
తరమునఁ జూడంగఁజాలు తనువున నోహో
గురుబాహూ! శరమేయకు
కరుణింపుము మార్గ మొసఁగఁగా వచ్చితిఁ జూ. 94

మ. వినవయ్యా! రఘువీర! వానరులలో వీరుండు ధీరుండు నై
తనరుం గాదె నలుండు వానికరముౝ దాఁకించి నామీఁద
న్వై, చిరవస్తువ్రజమెల్లఁ దేలు; నటులేఁ జేయంగ బద్ధాదరుం
డను గానౝ వడిఁజేయుమాజ్ఞను జగన్నాథా! కృపావారిధీ.

మ. అని పల్కుక్ శర ముజ్జగించి వితతంబౌ హర్ష మొప్పంగఁ
జెం, తను నిల్చున్నదివాకరాత్మజునితోఁ దథ్యంబు పాథోధి
తె, ల్పెను గార్యం బొనరింపఁ బంపు మన నవ్వీరుండు సం
తోష మొ, ప్ప నలుం బంచిన నాతఁ డల్లె యనుచుక్ బా
షాణముఖ్యంబులన్. 96

ఉ. సేతువుఁ గట్టె దానిపయిఁ జెందినవేడుక భల్లుకంబులుక్
గోఁతులు పోయిపోయి సుధఁ గ్రోలు నమర్త్యులకైనఁ జూ
డఁగా, నేతటినే నశక్యమయి యిద్ధపురం బన నొప్పు లంక
నుం, బ్రీతిని గాంచి; రంతట విభీషణుపల్కుల నాదరించు
చున్. 97

ఉ. రాముఁడు వాలిపుత్త్రు నభిరామగుణాకరు రాయబారముక్
సీమము మీఱఁ బంపఁ జని నిర్మలనీతులు గ్రుమ్మరింప ను
ద్దామబలంబు గన్పడువిధంబునఁ బల్కి సురారిభీతి యిం
తే మది నెంచ కోలగపుటింటిశిరంబును గూలఁదన్నుచున్.

చ. తనబలదర్పముల్ దనుజతల్లజు లెల్లఁ గనంగ రాముని౦
గనఁ జనుదెంచి చెప్ప రఘుకాంతుఁడు యుద్ధము సేయఁబూ
న్పుమా, యనఁ దపనాత్మజుం డనికి నాయితమై తనసైన్య
నాథులం, గని యిఁక లంకఁ బట్టుకొనఁగాఁ దగునంచును
సంజ్ఞచేయఁగన్. 99

చ. హరిగణభల్లుకోత్కరము లంతనె లగ్గలుపట్టిసాగఁగా
దురమటఁ జెల్లె దేవతలు తోరపువేడ్క విమానరాజి సం
బరమున నిల్పి చూచి బహుభంగులసన్నుతిచేయ నంత భీ
కరగతి దానవుల్ తొడరఁగాఁ గపులెల్లను బైకొనంగడున్.

చ. అరుదుగఁ జెల్లుచుండె; నట నయ్యమరారులలోన మేటులా

దురమునఁ జచ్చి రంత వగతో దశకంఠుఁడు తాఁకి యోడి
యే, పురమునుజొచ్చె నిద్రఁగనఁ బుట్టిన నాతనితమ్ముఁ డీగ్లె
ని, ర్జరవరు గెల్చినట్టి బలశాలి తదాత్మజుఁ డేగె నింగికిన్.

చ. తనయునిచావు స్వశ్రుతి విదారణదక్షముగాఁగ రావణుం
డనుజునిదోష మిామృతికి నొఁగద హేతు వటంచు భీతికృ
న్నినదము దిగ్విదిక్కులను నిండ నొనర్చి శరాసనావళుల్
దనకరసంతతిన్ వెలయ దారుణసంగరకౌతుకంబునన్. 102

చ. అరదము నెక్కి భీకరమహాసురు లెందఱొ తన్నుఁగొల్వఁ
బెన్, దుర మొనరించె; నాతనికిఁ దోడ్పడవచ్చినరాక్షసుల్
మహా, త్తరశరవృష్టి కీశసముదాయముముంచి కలంచి; రంత
న, స్మరుదధిపాత్మజుండు గుణమాన్యుఁడు రావణుమార్కొ
నెం దగన్. 103

చ. తలఁపడి యాతుధానపతిఁ దల్లడమందఁగఁ జేయ నాతఁడున్
బెలుచన మారుతిం దొలఁగ విక్రమ మొప్పఁగఁజేసి సోద
రుం, దలపడి బాణజాలములఁ దద్దయుఁ గప్పిన నవ్విభీష
ణుం,పలయకతీవ్రబాణములనాతనిసారథినొంచె; నంతటన్.

మ. తనదౌ సారథివంతఁ జూచి లయరుద్రప్రక్రమం బొప్పఁగా
మును ప్రీతిన్ మయుఁ డీయ నర్చనములం బొల్పారుచున్
భీతికృ, ద్ఘనఘంటాష్టకభూషితాకృతిఁ గనంగా నొప్పి
శత్రువ్రజం, బును ద్రుంపం దగియున్నశక్తి నసుజుం బోకా
ర్పవైచెం ద్వరన్. 105

శా. దానిం గాంచి విభీషణుండు భయగాద్గద్యంబు గాన్పింప
నెం, తే నో రెండఁగ బెండగిల్లుటయు నూహించెన్ సుమి
త్రాసుతుం, డానానావిధఘుంటికాన్వితమహా ప్రాకారశ

క్త్యాయుధం,బానీతి ప్రతిభావిశిష్టసురనాథా రాతి రాజానుజున్.

మ. పొలియం జేయఁగ వచ్చెఁ జెంత; కపు డాభూరిద్యుతుల్
మించు ను, జ్వలశ_క్తిం గని లక్ష్మణుండు బలదర్పస్ఫారతం
బొల్చి ని, స్థిరధైర్యంబున నవ్విభీషణునిఁ దోడ్తో వెన్కకుం
ద్రోచి చిం, తిలకే నిల్చి యనేకమార్గణములన్ దివ్యాస్త్ర
జాలంబులన్. 107

క. దానిని శాంతిలఁ జేయం
గా నెంతయుఁ బూన్కి వైచెఁ గాని యదియు న
వ్వానిం ద్రుంచుచుఁ బెలుచం
గా నిగిడెం బ్రతిహతంబు గానని త్వరతోన్. 108

క. శరముల శస్త్రాస్త్రంబుల
గురుబాహుబలంబుఁ జూపు కోరిక వైవం
బఱికింపక యాశ_క్తియు
స్థిరసత్వము మీఱవచ్చి త్రిదశు లడలఁగన్. 109

చ. కనుఁగొను నవ్విభీషణుఁ డఖండతరా_ర్తిని బొంద నంజనా
తనయుఁడు లోనుగాఁగలుగు దర్పకపీంద్రులు తల్లడంపడం
గ నిగిడి రాఘవానుజుని, క మ్రతరాయతవక్షమందు బ్రుం
గెను వడి; నంతలో నెపరికింపఁగ భూస్థలిఁ జొచ్చె నేర్పునన్.

చ. గురుతరశ_క్తివక్షమును గోరికఁ జీలిచి యంత నిల్వకే
ధరణి సహించునేమొ మదుదారజవంబనునూహఁ జొచ్చెనో
కరము వెలుంగు రశ్మి ననఁగాఁ గనరాక యడంగ; రాఘవే
శ్వరునుజుండుభూమిఁబడి,సత్వము తేజముదూలిపోవఁగన్.

తే. మోము వెలవెలఁ బాఱంగ ధీమహిమము
తప్పఁబడియుండె శవముచందమున; నంత

ననుజుఁ డని శత్రుఘ్నుఁ డతుఁ డగుట తెలిసి
కొని రఘూద్వహుఁ డెంతయుఁ గ్రోధ మొంది. 112

చ. అనుజునిమోముఁ జూచి యిది యాత్రికిఁ గాలము గాద
టంచు లో, నసె వగదాఁచి యాదనుజనాథుని గూల్పఁ
దలంచి మౌనియి, చ్చిన ఘనచాప మంది రిపుఁ జేరఁగఁ
బోయి శరంబుఁ గూర్చియా, తనిరథరథ్యసారథులఁ దవ్వల
ముగ్గ వెసఁ ద్రుంచె నేర్పుమై. 113

చ. శరములఁ గూర్చు టేయుటయుఁ జాపము వంగుట లేచు
టారయక, దరమెటు లేనిగామి రణాథాత్రినినిల్చినఁ జావు
తప్పదం, చరసెదురావణాసురు మహామతి రాముఁడు గాంచి
దానవా, దుర మొనరించి డస్సితివి దోర్బలమెల్ల నడంగెఁ
గావునన్. 114

చ చనుమల లంకలోనికటజాయలఁగాంచి యమాత్యవర్యులన్
గని ప్రియబంధుకోటులను గారవ మొప్పఁగఁబిల్వఁబంచివే
డ్కను మృదుభాషలాడి తమిఁగాంచియి దేకడసారిచూపటం
చును వచియించి చూడఁగలశోభనవస్తువులం గ్రమంబునన్.

క. కనుఁగొని తృప్తింబొందియొ
చను దెమ్మా! యనికి; మఱలఁ జనుట యనెడు నా
శను మాను మనుచుఁ బల్కిన
మనువంశసముద్రచంద్రుమాటల వినుచున్. 116

క. దశకంఠరవంబుల నా
దశరథసుతుఁ బొగడి చావుదప్పె ననుచు నా
దశకంఠుఁడు లంకను జొ
చ్చె శమం బూనియొ నిరాశ చిత్తమునఁ దగన్. 117

క. తనుఁ గొల్వవచ్చు దానవు
లను జూడక లోనఁజొచ్చి లలనామణినిం
గని రాముఁ బొగడి గతవా
ర్తను దెల్ప భయంబుగొన్న రమణుం గనుచున్. 118

క. శాంతిం గనఁజేసెడు వా
క్సంతతి వెలయించి మిగుల శౌర్యంబున భూ
కాంతుని జయింపఁ బూనెడు
పంతము గలుగంగఁజేసెఁ బ్రజ్ఞతనరఁగన్. 119

ఉ. కాంతగభీరవాక్యములఁ గ్రమ్మఱ విక్రమ మంకురింపఁగా
నెంతయుఁబూన్కిఁ జేయ మదినెంతయు సంతసమంది ధీరుఁడై
పంతములెన్నొపల్కి రఘుపాలుఁడొ రావణుఁడోయిలాస్థలిం
గాంతరొ నిల్చునీదినము కాని చెలంగరు వీరలిర్వురున్. 120

క. అనిపలికి సైన్యములనె
ల్లను గూర్చి రణంబు చేయు లాగున యత్నం
బును జేయుచుండె; నిక్కడ
మనువంశాభరణ మిటు సమరమునఁ బరుఁడున్. 121

క. పరుగెత్తిపోవఁ గని సం
గరరంగము వదలి యనుజుకడకుం జని యా
తురుఁడై ధరణింబడి ని
ష్ఠురచాపము కేల నొప్ప సునిశితశరమున్. 122

చ. ధరనొక ప్రక్కనుండఁ గపితల్లజు లార్తిని జుట్టునిల్వ సుం
దరముఖకాంతి మాయఁ గడుదారుణశక్తి యురంబుఁ జీల్ప
నిర్భరతరపీడచేఁ గలఁగి భవ్యతమాంగము ధూళిబ్రుంగ
నొప్పి రహితచేష్టుఁడైన రణవీరుని లక్ష్మణుఁ గాంచి దీనుఁడై.

చ. ధనువును బాఱవైచి ఘనధైర్యము తన్నెడఁబాయ లక్ష్మణా
యని ఘనకంఠనిర్గతమహారవ మెల్లెడఁ బర్వ నేడ్చుచున్
దనుఁ గని కీశనాయకులు తల్లడమందఁగ భూమిపైఁబడెన్;
దనువు విచేష్టితం బగుడు తాఁగనె మూర్ఛ మహార్త
మంతలోన్. 124

చ. స్మృతిగలుగంగ నల్లడలఁ జేరి కనుంగొనుకీశముఖ్యులన్
జతనముమీఱఁ జూచి కపిసత్తములార సుమిత్రపుత్త్రుఁ డీ
క్షితిఁబడియుండఁ గన్గొనుచుఁ జింతిల నేమిక లాభమబ్బు? వే
గతరలి పొండు స్వస్థలికి గార్యములెల్ల ఫలించెఁ గావునన్.

ఉ. ఎవ్వనితోడుగల్గఁగ నహీనసురారులఁ ద్రుంచినాఁడనో
యెవ్వనిసాయ మబ్బ మది నించుక భేదము లేక హాయిగా
నవ్వనభూమినుంటినొ, సదాదృతి నెవ్వఁడు నన్నుఁ గాచెనో,
యవ్వరమూర్తిలక్ష్మణుఁడు హా! ననునొంటిగడించియేగెఁగా.

చ. గుణములరాశి సత్పురుషకుంజరుఁ డర్హ్యతమాభిరామల
క్షణముల కాటపట్టు, భుజశౌర్యము గల్గినమేటి భీతికృ
ద్గణముల వైరి దానవనిరాకరణంబున వీరుఁ డిట్టి ల
క్ష్మణుఁడు కృపావిహీనుఁడయి స్వర్గముఁ జేరెను నన్నుడించియే.

చ. శతమఖు గెల్చినట్టి రిపుసత్తముఁ గూలిచి నాకుఁ బ్రీతి ను
న్నతమతిఁ గల్గునట్లుగ నొనర్చినమాన్యుఁడు చిన్ని సోదరుం
డతులితబాహుదర్పుఁడు మహారిపుకాననదావకీలిస
ద్వ్రతుఁడు సుమిత్రపట్టి ననుఁబాసిచనెంగద యేమి హేతువో.

ఉ. ఆడఁడు మాఱుమాటలమహాదృతిఁ గాంచుటె కృత్యమంచు
నన్, గూడిరొ యుండు నెప్పుడును గూడనికార్యమిదంచు
నెంతయున్, బోడిమిమీఱఁ దెల్పుహితముల్ మరియా

డదే, పాటియుఁగాని శక్తి దగువాఁతఁబడెం బలుమాట లేటికిన్. 134

చ. అని యిటుచూచి పావనియు హస్తములం గడు లాగిలాగి యా,ఘనతరశక్తిఁ దీయుటకుఁ గాని కదల్పనుగాని జాలకో య్యనఁ దపియించు టారసి మహత్తరరోషము పైకొనంగఁ దాఁ,జని యొకవ్రేలఁబట్టి గురుశౌర్యము మీఱఁగఁ దీసి లీలఁగన్. 135

ఉ. అవ్వలఁ బాఱవైచి సుగుణాకరుమోమును గాంచి యొక్క టం, జివ్వన భూమిపైఁబడియెఁ జిత్తము దుఃఖమహాబ్ధి బ్రుంగ; న, ట్లవ్వసుధాధిపుండు కడునార్తిని బొందఁ గపీం ద్రుఁ డాడియా, నవ్వనచారులంద అపు డల్లె వెతంగని యేడ్చి రొక్కటన్. 136

ఉ. అంతటఁ దెప్పిఱిల్లి మనుజాధిపుఁ డారిని గాంచె వక్ష మ త్యంతము చీల్చుకొంచును భయంకరరీతిని బొంగువాహినీ కాంతుతరంగమాలికయె గాఁ జను నన్నటు లుండురక్తముల్ బంతము మీఱ శక్తిహతి వ్రాలినలక్ష్మణు నొక్కసారిగన్.

చ. కనుఁగొని హుంకరించి లయకాలభయంకరరుద్రు నాకృతిన్ గని కఠినస్వనం బలరఁ గార్ముకవర్యముఁ దెమ్ము లక్ష్మణా దనుజుని నిప్డె మారుకొని దర్ప మడంచి తదీయశీర్ష రా జిని తుతి తృప్తిఁగాంచు నటుచేసెద నంచు వచించి యంత లోన్. 138

వ. తనమది నెంచె లక్ష్మణుఁడు ధాత్రిని వీడి సురాలయంబుఁ జే రెనుగద యేటిభ్రాంతి యిది స్త్రీల దిదేమొకో నామనంబు, త, మ్ముని మృతినొందఁగాఁ గనియు భూరితరాశ్మకృతంబయే

యిదొ, గనుకనె నిశ్చలత్వమును గాంచుచున్న దటంచు నెంచుచున్. 139

చ. హరివరు లార్తులై పొగుల నల్లి కనుంగొనుచున్ గళస్వనం బరుదుగఁ గన్పడన్ బలుకు లట్టి తడంబడఁ దమ్ముఁ జీరుచున్ హరివరులార! పల్కుఁడిటు లార్తిని బొందఁగ నేల? యంచు భీకరతరవార్తతుల్ వెడలఁగా వడిఁ బ్రశ్న మొనర్చుచున్ వెతన్. 140

చ. నలుఁగడలుం గనుంగొనుచు నాయనుజన్ముఁడు భూమిఁ ద్రెళ్లె నే, ఖలదనుజప్రయుక్తమయి గాఢతరం బగునాయు ధంబు చేఁ, గలుగునె యిట్టిపాటు రఘుకాంతుని తమ్మున? కేల గల్గెనో, తెలియఁగఁజాల నంచుఁ గడుదీనత నేమియుఁ దోఁప కంతటన్. 141

క. నలుదెసల దృష్టిఁ బఱపుచుఁ
గలవిలపాటొందుమదిని గపులం గనుచున్
బలికెన్ రాముని జీవిత
మిల నంతం బయ్యె నరుగుఁ డింకం బురికిన్. 142

క. చేసినవాగ్దానంబుల
గాసిలకుండంగఁ దీర్పఁగాఁ జాలని నా
యాసను విడువుఁడు చనుఁడేఁ
జేసెద నంజలుల నింకఁ జేరుఁడు పురినిన్. 143

క. ఆడినమాటను దీర్పం
గూడనికాలంబువచ్చెఁ గొంకక మీరే
వేడ్డైతిరి మీశక్తిని
జూడక ప్రాణములవీడఁ జూచితిరి సుఁడీ. 144

తే. ఎన్నివిధములసాయ మిట్లీరుచేయ
దైవగతి వేఱురీతిఁగాఁ దలఁచెఁ గాన
నీప్రయత్నము నిష్ఫల మిస్వ డయ్యె
శవమునకు స్నాన మొనఁగూర్చుచందమునను. 145

తే. మునుపుచేసినధర్మముల్ ముం దొనర్పఁ
దలఁచి యున్నటిధర్మముల్ తప్పుత్రోవఁ
ద్రొక్కె సాయంబుచేయవు రూఢ మిద్ది
పలుపలుకు లేల చనుఁ డింక వసతులకును. 146

క. అనుజుని మించినబాంధవుఁ
డనఁ గలఁడే నాకు నిశ్చయం బిది గానన్
జనియెద నేనును సోదరుఁ
గనఁగా స్వర్గంబునకును గపివరులారా. 147

చ. వనితల బంధువర్గముల వర్ణ్యమణిప్రకరంబులన్ ధనం
బును మఱియెన్నియేనియు విభూతుల గ్రామములం బురం
బులన్, జనపదరాజిఁ జేర్పఁదగుసంతతినిం గనవచ్చుఁగాని
భూ, మిని సహజాళిఁ గాంచఁదగు మేటియుపాయము
తోఁప దేదియున్. 148

చ. జనకకుమారికై లవణసాగరముం దరియించి భీతికృ
ద్దనుజులఁ ద్రుంచి యెవ్వరికిఁ దార్కొనరాని దశాస్యసోద
రున్, సునిశితబాణజాలముల శోణిఁ బడంగ నొనర్చినట్టినే
నని మొనఁ జచ్చినట్టి సుగుణాఢ్యసహోదరుఁ జూడఁ
జాలమిన్ 149

చ. పురుషుఁ డొనర్చునట్టికృతి భూరివిధిప్రియమౌన యేనదు
ర్వరఫలియించు లేనియెడఁబాడగునంచుఁదలంచువాఁడఁ గా

పురుషులు దీనిరీతిఁ గనఁబోలమిఁ గుందుదు రిప్పు డేను సో
దరుమృతికై వగం బొగులఁ దప్పకయాతనిఁ జేరఁబోయెదన్.

చ. వినయగుణైకభూషణ విభీషణ లంకకు రాజుఁ జేయఁగా
మనమున నెంచి యాకడలిమాన్యజలంబులు లక్ష్మణుండు తె
చ్చిన నభిషిక్తుఁ జేసితిని సిద్ధఫలం బిది కాకపోయె నే
మనఁగల దింక నంచుమదినారట నొందకుమీ యొకప్పుడున్.

చ. వరగుణరాశిసోదరుఁడు భవ్యవచస్కుఁడు సూనృతేష్టుఁడా
భరతుఁడు రాజ్యమేలెడిని వైళనయాతనిచెంత కేగి ని
ష్ఠురతరవార్త దీని మును శ్రోత్రపథంబును బొందనీక రా
జ్యరమ నొసంగె నా కనుము వాఁడె యొసంగును రాజ్య
మంతయున్. 152

ఉ. ఆవల నీమహాహవము నంతయుఁ జెప్పుచు సోదరద్వయం
బీవిధిఁ గూలె నంచు వచియించి కుమారక, నీవు నాసుహృ
ద్భావముతోడఁ గూడితటితివారక ప్రోవుమటంచుఁ జెప్పుచున్
దావదలెన్ శరీరమని దానవనాయక, పల్కుమాదృతిన్.

క. అనిపల్కుచు విలపించుచు
మనుజాధిపుఁ డుండె; నంత మహితాత్ముం డౌ
హనుమయు దుఃఖాంభోనిధి
మునిఁగియు నిసుమంత ధైర్యమును గాంచి వడిన్. 154

ఉ. చెంతకుఁబోయి లక్ష్మణునిచిహ్నము లన్నియుఁ గాంచి
యచ్చటన్, వంతలఁ గుందుచున్న రఘువర్యుని దీనుని
సూర్యసూను నొక్కింతయు ధైర్య మొందని యహీన
మతిన్ దనుజేంద్రుఁ జూచి సుస్వాంతము పల్లవింప నిటు
పల్కె నిదేటికో వంత నొందుటల్. 155

క. మనలక్ష్మణు వదనంబునఁ
గనఁబడియెడులక్షణములు కాంతంబులుగాఁ
దనుకాంతి యలరుచున్నది
కనుఁ డీదీనత్వ మేగఁగాఁదగుప్రాన్కిన్. 156

తే. మూర్ఛమున్గినలక్షణములు గనఁబడు
చున్నయవి సుంత ధీగత నూని కార్య
గతులఁ దలపోయుఁడీ యని గాలికొడుకు
పలుకఁగా జాంబవంతుఁ డిట్టులనె యెన్ని. 157

క. అగు నగు మారుతిపల్కిన
ది గణింపఁదగినయట్టిదిగ నున్నది కాం
తఁగ లక్షణజాలంబులు
తగియున్నవి ప్రాణ మున్న తనువిది యనఁగన్. 158

చ. వనచరులార! ధైర్యమును బాయకుఁడో దనుజేంద్ర! వంతలం
గనకుము కేశనాయక వగం బడకుండుము రామచంద్ర నీ
యనుజుఁడు కాంచలేదు మృతి నద్భుతరీతినిమూర్ఛమున్గెనీ
తనివదనంబునందు ద్యుతి తగ్గదు దంతములోష్ఠయుగ్మమున్.

చ. శ్రుతులును నల్లఁబాఱవుసురోచులుకన్నడెడున్ నఖంబులం
దతిశయరక్తమియ్యదియె యంగుళులం జెలువాఱెడున్
మహామణి యితఁ డట్టె మూర్ఛఁగని మ్రాన్పడియెన్ నిజ మిద్ది
రామచంద్ర! తగదుదుఃఖమొందనిఁక ధైర్యముఁబూనుము
తేర్పు మెల్లరన్. 160

చ. కలఁడుగదా సుషేణుఁడు నికామము వైద్యము నేర్పు
బుద్ధి యుక్తులుగలవాఁడు ధీరుఁడు నగున్ క్షితినాయక
చంద్ర! యన్నన, ప్పలు కమృతంబుగా శ్రుతులఁ బర్వఁగ

రాఘవుఁ డట్టె లేచి యో,లలితగుణా! సుషేణ! మనలక్ష్మణుఁ
జిన్నిసహోదరుం గృపన్. 161

క. బ్రదికింపు మంత నేనును
బ్రదికినయ ట్లెన్న నగును బహుభంగుల నిం
కః దగం బరీక్షచేయుము
విదితంబె కదా తదీయవిమలగుణంబుల్. 162

క. ఆతఁడు సజీవుఁ డైనన్
నాతండ్రియె బ్రదికినట్టు లగులక్ష్మణునిం
బ్రీతిం గాంచితినే నా
యాతనువున నిల్చు నసువు లిది సత్యము సూ. 163

క. అని దీనతఁ బ్రార్థించిన
విని యా శ్రీరాము దీనవృత్తిని గని య
వ్వనచరవరుఁడు సుషేణుఁడు
చని లక్ష్మణుమోము విధముఁ జక్కం గనుచున్. 164

క. తననేర్పుకొలఁదిఁ బరికిం
చి నృపుం గీశేశుఁ గాంచి చిత్తం బలరన్
వినిపించె నిట్లు లక్ష్మణు
తనువును విడనాడ దసువితానము వినుఁడీ. 165

క. నాలుగుయామంబులు ప్రా
ణాళియు వదలంగఁ బూన కలరుఁ దనువునన్
బాలార్కుఁడు తోఁచినఁ జనుఁ
జాలము తర్వాత నితని సంరక్షింపన్. 166

క. కనుకన్ భాస్కరు నుదయం
బునకున్ మును పౌషధములమూలంబున నీ

తని బ్రదికింపంజను నం
చని మఱియుం బల్కె నూహ లలరుచు నుండన్. 167

వ. హిమాలయంబున కవ్వలఁ బెక్కుయోజనంబులదూరంబున ద్రోణమహీధ్రంబు గలదు అద్దాని దక్షిణశిఖరంబున విశల్యకరణి సౌవర్ణ్యకరణి సంధానకరణి సంజీవకరణియు ననునామంబులుగల నాల్గులతలు గలవు అవ్వి జ్యోత్స్నలతలనియుం జెప్పంబడు. 168

మ. వినవయ్యా! రఘువీర ద్రోణగిరికిన్ వేపోయి జ్యోత్స్నలతల్, గొనితే నొప్పును దూర్పుకొండపయికెక్కున్ భానుఁడేవేళ నీ,తనికిన్ బ్రాణము లంతకున్ మునుపె జ్యోత్స్నపీరుదుచ్ఛ్రిరాఁ, జనుఁగాకున్న మఱొండుమార్గమరయన్ సాధ్యంబు గా దేదియున్. 169

శా. వానిం దెచ్చుట కింక వాయుగతిఁ బోవచ్చున్ మహాశూరులై, దానిం గాచు నమర్త్యకింకరుల నుద్దామప్రతాపంబునం, గానీ వేడుట గాని తోలుటయొ నిక్కంబైనప్రేమంబునన్, వానింజూపెడువా ట్లొనర్చుటయొ భూనాథా త్వరం జేయనౌ. 170

సీ. ఆపర్వతంబు నహర్నిశల్ గంధర్వు
లమరకింకరులు శౌర్యంబు పొంగఁ
గాపాడుచుందురు గాన వారల వేఁడి
వారు చూపఁగఁ దత్ప్రభావ మెఱిఁగి
కొని తేఁదగున్; వానిగుర్తులు తెల్పెద
హారితవర్ణఫలంబు లమరియుండ

నరుణపుష్పంబులు నతిసితప్రభనొప్పు
 పత్త్రంబు లమరంగఁ బరమతేజ
తే. మొప్పఁగానుండు నాతీఁగె లెప్పుడేని
మండుచున్నట్లు కనఁబడుచుండుఁగాని
చేరఁబోయిన నంతటి దూరభూమిఁ
గానఁబడుఁ జుమ్ము తచ్ఛక్తి గ్రాలురేయి. 171

క. అరుణోదయమైన యనం
తర మయ్యావి గానఁబడుట ధాతకె యని భూ
వరచంద్ర! నేను వింటిని
ద్వరపడి యవ్వానిఁ దేరఁ బనుపుము పూన్కిన్. 172

క. నాలుగుజాములు క్షణదా
కాలముగద యంతలోనఁ గడువడిఁ జని తేఁ
బోలును సోదరుప్రాణము
లోలిన్ నిల్పం దలంచు టొప్పున యేనిన్. 173

క. ఇఁక నాలసింపఁ గార్యం
బు కడుం జెడు; నీత్రియామ ముగియక మునుపే
యొకవీరుఁ బనుపు మాతం
డె కదా సౌమిత్రి ప్రాణహితుఁడు రఘుపతీ! 174

క. అనిపల్కి యూరకుండిన
విని యారఘురాముఁ డెల్లవిధములఁ గనినన్
హనుమయె మదిఁదోఁచిన ని
ట్లనియెం గపిసంఘముఖ్యు లందఱు వినఁగన్. 175

క. మన కెల్లఁ బ్రాణమిత్త్రుం
డనుకూలుఁడు దిక్కు దాత యనఁ బావనియే

వినుఁడే నొక్కటి తెల్పెద
మనలక్ష్మణుఁ డసువులఁ గని మహినుండంగన్. 176

క. పరమేష్ఠి తలఁచియున్నక్
ద్వారఁగా నీహనుమ ద్రోణధాత్రీధరముం
బరికించి లతలఁ దేఁ దగుఁ
బరహిత మొనఁగూర్ప నితఁడె పండితుఁ డగుటన్. 177

క. అనిపలికి హనుమతో ని
ట్లనియెక్; లక్ష్మణుని జూడు మవనింబడియెక్
ననుఁజూడు మితనిలోఁచనె
చన నెంచినహానిఁ గీర్తిసత్తము! యింకన్. 178

తే. ఆలసింపక నీవు చేయంగఁదగిన
కార్య మొనరింపు నీకంటె ఘనతరబల
జనయుతుం డిలఁ గల్గునే శ్వసనపుత్త్రుఁ
డవుకదా నిన్నుఁబోల నిం కెవరు గలరు. 179

చ. అనవిని జాంబవంతుఁ డనిలాత్మజుఁ గన్గొని రామకార్య మే
యొనగుసఁ బుట్టినాఁడవు మహోగ్రబలుండవు తండ్రికంటెఁ
జ, య్యనఁ జనుశక్తి నీకుఁగల దట్లగుటం జని ద్రోణశైల
ముం, గని యటనుండు నాలతలఁ గైకొని వచ్చి సుమిత్ర
పుత్త్రునిన్. 180

క. బ్రదికించి రామచంద్రుని
బ్రదుకంగాఁజేసి మమ్ము వసుధాస్థలి నుం
డఁ దగంజేయుము నిన్నే
కద నమ్మితి మేము సర్వకార్యములందున్. 181

వ. ఇఁక విశేషించి చెప్పం బనిలేదు. పయనంబునకుం గట్టాయి

తంబు చేయుము. మార్గం బుపదేశించెద వినుము. లవణ పారావారం బవలీల లంఘించి యుత్తరదిశం గాంచుచుం బోవంబోవ సాంద్రభయంకరశ్యామలతరువరనికరపరిభాసురంబు లగునరణ్యంబులు చక్షుర్గోచరంబు లగు. తత్సౌందర్యంబుఁ దిలకింప మదిఁ జోటీయక పుణ్యారణ్యంబు లౌట నేత్రమరీచు లవ్వానిపయి నించుక పొలయించి యవ్వానిం గడచి యవ్వలం జనిచని బృందారకబృందసంసేవ్యమానపావనసానుతలంబుల నలరుచు, నంబరస్పృగ్వితతబహుశాఖాసమాచ్ఛాదితదిగంతరబహువిధవటనమేరుప్రముఖవిటపిపటలంబులఁ జెలువారుచుఁ, దత్రత్యపావనజలాశయప్రవిమల వారిపూరతరంగ మాలికాడోలికావిచలత్సరసిజప్రముఖ కుసుమవిసరసింహాసన సమారూఢభవ్యపరిశుభ్రపత్ర సమాకృష్యమాణప్రియామనోహర కూజితసంశ్రవణలాలసమరాళాదిజలపతత్త్రివితతిదర్శనీయంబు లగునుపరిభాగంబుల నొప్పుచుఁ గనుంగొన నానందప్రదంబులై విశ్రమింప సుఖకరంబులై, సంచరింప నర్హంబులై, యసదృశవిభూతిసమృద్ధి నలరుట మహాదేవసమతం గాంచుచుఁ, గమలాస్పదంబు లౌటఁ గమలాస్పదంబులై, రత్నాకరంబులౌట రత్నాకరతుల్యంబులై, కానంబడుపావనభూధరంబుల నించుక నేపు కాలూని సమ్మానించుచు, నటనుండి కడువడి వెడలి యవ్వలి దగుపుడమిఁ గనంబడువినోదంబులు ప్రియామయం దును గపులకుం గలదూరదృష్టివిలాసంబునఁ గనఁబడుచున్నను దడవుసేయుట పాడిగామి వడివడిఁ జనుచుఁ, దదనంతరంబ పెక్కుయోజనంబులదూరంబున నెవ్వారికేఁ జేరశక్యం

బుగానిత్యహిమశిలలఁ జెన్నొందుచు, నభంగురోత్తుంగతరంగ
మాలికల బొంగుగంగచేఁ బరమపావనతం గాంచుచు
సురకిన్నరాదిసకలదేవపరిష్పూజితపరమపావన పాదారవిందమ
హాదేవనివాసస్థానం బగుట సర్వోన్నతత్వంబున జూపట్టుచు
మునివరనివాసాగ్ర్యతపోవనవిరాజితంబై, గంధర్వకిన్నరకిం
పురుషసిద్ధాగ్ర్యభూరిగుహాగృహనిబిడంబై, సకలధాతు
చిత్రితసానునికరంబై, సకలదేవతాలయమానితంబై, వివిధ
మృగసంకులంబై, సర్వపుణ్యస్థలాకరంబై, యసమానవిభూతి
నలరారుచున్న రజతపర్వతంబన, హిమాలయంబనఁ, గైలా
సంబన, మఱియు బహువిధనామంబుల విరాజిల్లుచు, మహో
న్నతశిఖరంబై యంబరంబు స్పృశించుచున్నహిమగిరి సబ
హుమానంబుగా నతిక్రమించి కొంతదూరంబు పోయి
పోయి యందు. 182

సీ. వటపత్రశాయియై వాసుదేవుఁడు పరా
త్పరుఁడు నిర్వృతినొందఁ బవ్వళింప
లోకైకమాతయై; ప్రాకటగుణపూత
యైనలక్ష్మీదేవి యాదిఁబుట్టఁ
చింతామణియు దేవసింధువు నింద్రాశ్వ
మాదిపదార్థంబు లలరఁ గలుగ
దేవతావళులకు దివ్యాన్న మనఁదగి
చాన్పుఁగూర్చని సుధ జననమందఁ
తే. దనదు భూతికి సాటిచేయను దగినవి
విశ్వమున లేనియట్లుగ విలసిలుచును

బరమపావనమై కీర్తిఁ బరఁగుక్షీర
సాగరంబును గాంచుమో శ్వసనతనయ. 183

క. కని దానికి వందన మిడి
చను మవ్వల దూరభూమిఁ జంద్రగిరి యనం
జను పుణ్యశైల మొక్కఁడు
కనఁబడు దృష్టులకు వేడ్క గలుగఁగ ఘనమై. 184

ఉ. దాని మహాత్వ మెన్నుటకు దా ఫణినాథుఁడు చాలఁ డింత యుఁ, బూని విధాతృగీష్పతులు. పోలరు దానివిభూతి నెన్నఁగా, దాని విశాలశృంగములు దానిమహాత్తరరత్నకాంతులే, మానక తత్ప్రభావ మతినూనుప మంచును దెల్పఁ జాలెడున్. 185

క. ఆగిరికి నుత్తరంబునఁ
బ్రోగై మణు లున్నయట్లు పొలుచుచు రుచులన్
దా గణుతింప నశక్యం
బై గంధర్వులు చరింప హారితరంబై. 186

క. అలరారుద్రోణపర్వత
మిలకున్ భూషణముఖేచరేష్టప్రదము
జ్జ్వలరత్నసానుభాసుర
మలఘు లసచ్ఛిఖరచుంబితాంబరమును నై. 187

చ. సురపథమందుఁ దన్మణిరుచుల్ ప్రసరింపఁగ దేవకాంత లాదరమున వ్యోమయానములఁ దారొగి నాథులఁగూడి పోవుచో, నరుదుగఁ దద్గిరిప్రభల నాత్మతనూరుచు లట్టె మూలఁగాఁ. బరిపరి గాంచి వేగతుల వర్ణనచేయుదు రోపికల్లగన్.

క. సురవినుతంబై కిన్నర
పరికీర్తంబై పవిత్రసాధోవిలస
త్సరిదుజ్జ్వలమై యొప్పుచు
ధరణీధర మద్ది యసమతన్ విలసిల్లున్. 189

క. దూరమునుండి కనంగ మ
హారత్నాకరీచుల నది యగ్నిగిరి యొకో
యీరీతి వెలుఁగు నని యో
మారుతి! మదిఁ దోఁచు దీని మఱునఁజనదుసూ. 190

చ. మును పమృతంబుఁగోరి సురముఖ్యులు మోసముచేయ దైత్యసుల్, పనివడి సాయమై తఱువఁబాలసముద్రమునుండి మృత్యువుం, గననివిధంబు జేయఁదగు కమ్రతరామృతనామ కౌషధం, బనితరశక్తియుక్త మది యల్లన దోఁచె సురాళు లుబ్బగన్. 191

చ. అమృతముఁ గాంచి నిర్జరు లహోయని వేడుక నాట్యమాడ నె య్యమున మహాసురుల్ తమకు నందొక భాగము నిత్తు రన్న మో, దమునఁ జెలంగ శ్రీహరియుఁ దక్షణమం దె సురారివం చనా, క్రమమున మోహినీతనువుఁ గర్బురులాసుధఁ ద్రాగఁ గూడమిన్. 192

తే. ఇట్టు లసురుల వంచించి యెలమి మిగులఁ
బల్కుచునె యయ్యమృతమెల్లఁ బాపభీతు
లైనదేవతలకు నిచ్చె; నంత దితిజ
వరుల నోడించి రమరు లాహరికరుణను. 193

క. దనుజులు పాఱిన నమృతం
బును నాద్రోణాద్రిసానువున నిడి యవలం

గొని చని త్రాగిరి కావున
హనుమంతా ద్రోణశిఖరి నమృతం బిడుటన్. 194

క. ఆసుస్థలమున మొలచుట
భాసురవిద్యుత్ప్రదీప్తిప్రతతులు వెలయుఁ
దోస మెఱుంగనిస్థల మది
యై సకలస్థలములందు నతిపావనమా. 195

వ. ఆలతలు జ్యోతిర్లత లనం బ్రసిద్ధంబులై దేవతావరప్రసాదంబున నప్రధృష్యంబులై సంజీవకరణి, సంధానకరణి, విశల్యకరణి,సౌవర్ణకరణియనునామంబుల విలసిల్లుచు, దీపాకృతిఁ మండుచుండు సమీపించిన దూరమ్మునందోఁచు. రాత్రియందిట్లు వెలుంగుచుఁ బగటిపూట సామాన్యలతలవలెం గనఁబడుచుండు. కావున నవి రాత్రియందు ఫలము నొసంగఁ జాలిపగటియందు వ్యర్థంబులై యుండు.కావున సుషేణుండు చెప్పిన యట్టిగుఱుతుల నవ్వాని నెఱింగి కైకొనిరమ్ము. చెంతనుంబోవ దూరంబునం దోఁచుట నెట్లు తేవలయునంటివేని.

మ. సురకార్యం బిది, యంతరాయమును గూర్చుఁ దీని కెవ్వాఁడు ని, ర్జరులే నీకటఁ దోడుపాటు తగఁగూర్పఁ సిద్ధులై యుందురో, మరుదాత్మప్రభవా! జవం బమర నీ మాహాత్మ్యమొప్పార భీ, కరశౌర్యంబు గనంబడంగఁ జనుమా కార్యంబు నీడేర్పుమా. 197

క. ప్రతిపదమందున నమరులు
హితముం గూర్పంగనుందు రెంతయుఁ బూన్కిఁ
మతిమంతా, హనుమంతా
దితిజాంతక, పోయిరమ్ము తీవ్రత్వరతోన్. 198

క. నిను నాశ్రయించి కపిపతి
యును మేమును నున్నవార మోసత్పురుషా!
ఘనకార్య మిద్ది రాముని
యనుగ్రహ మ్మొందఁదగిన యద నిదియొకదా. 199

తే. త్రిజగములయందు నీదుకీర్తిద్విజేశుఁ
డసదృశస్ఫూర్తి వెలయుత మర్కవంశ
మమల మాచంద్రరవితారకముగ ధరణి
నిలుచుఁ గావుత నింకేల పలుకు లిచట. 200

చ. హనుమ! మఱొక్కమాట విను మాగిరివర్యముఁ గాంచినం
తనే, వినయముమీఱ భక్తిఁదగ వేయినమస్కృతు లెన్ని
చేసి రాముని దగు కార్యముం దెలిపి ముందుగ దీని నొనర్పు
మంచుఁ బ్రార్థన మొనరించి నిర్జరులఁ దద్దయు వేఁడి తదా
జ్ఞనందుచుఁ. 201

చ. లతలను జూచి సాధునుతులఁ గయిమోడ్పుల భక్తిఁదెల్పి
య,ద్భుతమహిమంబునం బొలుచు భూమిని ద్రవ్విఁ పవిత్ర
రీతిఁ గొం, చతిజవ మొప్ప రమ్ము శుభమయ్యెడు నీకని యా
శిషంబు లా,దృతి నొనరింప వాయుసుతుఁ డెంతయు వేడుక
పిచ్చలింపఁగన్. 202

శా. శ్రీరాముం గని తత్పదాంబుజములం జేమోడ్పు సంధిల్లఁ
గాఁ, బ్రారంభంబునఁగొల్చి భల్లుకగణాధ్యక్షుఁ గపీంద్రుఁ
మహా, వీరాగ్రేసరు నాసుషేణు నళునిఁ వేడ్కల్ తగం
గొల్చి యా,క్రూరాత్ముం డగుపంక్తికంఠుకృతికిం గోపంబు
దీపింపఁగన్. 203

ఆ. సహజధైర్యశౌర్యసాహసంబులు జవ
మలర నిట్టు లనియె నాజ్ఞయందు
క్షణములోన నరిగి శైలంబుఁ బ్రార్థించి
దివ్యలతల నిటకుఁ దెచ్చువాఁడ. 204

క. గిరి యది పలుకక యున్నన్
సురలం బ్రార్థింతు వారు సుముఖులు గాకు
న్నరహిన్ లతలన్ వెదకుదుఁ
ద్వర నవి కన్పడకయున్న బాహుబలమునన్. 205

క. ధరణీధ్రముఁ బెకలించియె
శిరమున ధరియించి తెత్తు శ్రీరఘుకులసా
గరశీతరశ్మి యానతి
సరసిజమిత్రుండు తూర్పుశైలాగ్రంబున్. 206

క. ఎక్కకమున్నే లక్ష్మణుఁ
డిక్కడఁ జెలువారునట్టు లేచేయుదుఁ జే
రుక్కున దేవత లడ్డినఁ
జక్కాడుదు నమ్ముఁ డిద్ది సత్యం బనుచున్. 207

క. శ్రీరాముని కార్యంబున
కారయ విఘ్నంబుచేయునట్టిఁడు గలఁడే
మారుతితనయుఁడు శ్రీరఘు
వీరుని కింకరుఁడు గాన విజయము గనుచున్. 208

ఆ. త్వరగ రాఁగలండు దైవంబు తోడ్పడ
నంచుఁ బలికి రాము నంఘ్రిజలజ
ములకు మరల మ్రొక్కి సులలితవాక్కుల
నాశిషంబు లిడఁగ నందుకొనుచు. 209

చ. వనచరవీరు లందఱిని భక్తియుఁ బ్రీతియు నుల్లసిల్ల వీ,డ్కొ
ని తగ నుత్తరాశఁ గనుఁగొంచు భుజంబుల నప్పళించి తోఁ,
కను గదలించి సుంత తనగాత్రము ముందును వెన్కఁ బ
ర్వఁగా,ఘనతరమై చెలంగునటుగాఁగదలించిమహాజవంబునన్

ఉ. రామునిపాదపద్మముల రంజిలు చిత్తముతోడ లక్ష్మణ, స్వా
మికిఁ బ్రాణదానము నొసంగఁగఁ బూనినయత్నయుక్తి
నా, ధీమహితుండు పావని మతిస్థిరతం గని నింగికిన్ మహో,
ద్దామత ఖేచరుల్ పొగడఁ దా నెగిరెన్ రఘురాముఁ
డుబ్బఁగన్. 211

ఉ. మానని పూన్కి నీఘనుఁడు మారుతి వేగమ పోయి శైల
మున్, మానితవీరుదన్వితము మానవదృష్టి కగమ్యమున్
మహా, దానవసంఘజుష్టము నితాంతభయంకర జంతుయుక్త
మున్, బూనికఁ జెచ్చెఁ గాత మని పొంగి సురల్ తలపోసి
రొక్కటన్. 212

చ. సుర లిటు లెంచునంత గుణశోభితుఁ డాహనుమంతుఁ డెం
చె సు,స్థిరమతి నీసముద్రమును జెచ్చెఱ దాఁటెద మున్ను
పోలె నం,తరమున విఘ్నముల్ గలుగఁదప్పక కాలము మీ
ఱుఁ గాన స,త్వరగమనం బె యుక్తమని తాఁ దలపోయుచు
హుంకరించుచున్. 213

చ. తనజవ మప్డు సన్నుతికిఁ దావలమై పవమానవేగమున్, మన
సునకన్న వేగ మనుమాటను దాఁటి యిదేటిచిత్రమో, య
ని తలపోయఁగాఁ దగినయట్లు చెలంగఁగ రామభక్తుఁ డో,
య్యన జలధిన్ దరించె; నిటు లాహనుమంతుఁడు కంధి దాఁ
టుటల్. 214

చారులు రావణునకు హనుమద్వృత్తాంతముఁ దెలుపుట.

క. సంజీవికరణి రాత్రి స
మంజసఫలదంబుగాన మహితాద్రికి నో
య్యం జని తెమ్మా లత యది
యుం జచ్చినవాని కసువు లొసఁగు నటంచున్. 215

తే. దానితోడనె తక్కినవాని నావి
శల్యకరణి ప్రముఖములఁ జక్కఁజూచి
తేఁగదే యని కపిగణాధీరుఁడైన
యాసుషేణుండు పల్కుట యల రఘుపతి. 216

క. హనుమను గని ప్రియబంధూ
యనుజునిప్రాణంబు లొసఁగు మతఁడే లేకు
న్న నిజంబుగ నేనుఁ బ్రదు
కను జుమ్మీ యంచు దుఃఖకలితోక్తులతోన్. 217

క. వేఁడుటయును గపినాయకుఁ
డాడినపల్కులను జక్క నాలించి యిదే
నేఁడు గనం జేసెద నా
ప్రోడతనం బనుచు హనుమ పూని త్వరగతిన్. 218

క. వననిధిదాఁటఁగ నెగురుట
యును గూఢాకృతుల నందునుండి కనిన యా
దనుజేంద్రుదూతలయి శుకుఁ
డన సారణుఁ డనఁగ మాయ నలరెడు దనుజుల్. 219

చ. చని చని దానవేంద్రుని నిశాచరసంఘయుతుఁ దురంత
పా, పనియతకార్యతత్పరుని బ్రోఢసురారిగభీరభాషణై, క
నిరతుఁ గాంచి మ్రొక్కి తమకంబున సాగినకార్యభంగిఁ

జెప్పఁ బ్రమదంబు నొంది రణవీరుల నిండ్లకుఁ బంపి యొం
టిగన్. 220

తే. చేయఁదగునట్టిక్రమ మేదొ యీయదనున
నంచు నించుక యోజించి యాదరమున
వారలకు బహుమానంబు వరుస నొసఁగి
యిండ్లకుం బంపి యొక్కనిహితకృతికరు. 221

క. తనమానసవృత్తిని దెలి
సినవానిని, జెప్పినట్లు చేసెడువానిఁ
గని యాదరణము వెలయం
గను బిల్చి వచించె నిట్లు కమ్రతరోక్తిన్. 222

క. ఇతరశ్రుతులకుఁ దెలియని
గతి నావాక్యములను విని కడువడిఁ జని స
న్మతిఁదగినకాలనేమిని
జతనము మీఱంగ నాదుశాసన మనుచున్. 223

క. తెలియంగఁ బలికి తోడ్కొని
యలఘుజవం బొప్ప నాదునంతికమున కి
మ్ముల రమ్మా యన నతఁడు గ
దలి చని యంతయును దెల్పి దనుజవరేణ్యున్. 224

క. కడువడిఁ దోడ్కొనిరాఁగ న
తఁడు వందన మాచరించి ధన్యుఁడ దేవా
యుడుగని ప్రీతిని నన్ని
ప్పుడు పిల్చుట కెన్న హేతువు గలదె యొదియున్. 225

క. తెలియఁగఁజాలక మదిలోఁ
గలఁతం గనుచున్నవాఁడఁ గావునఁ దెలియం

బలుకుఁడు నావగు ప్రాణం
బుల నిచ్చెద నాజ్ఞయైనఁ బొంగుచు దేవా. 226

క. ఏకాంతంబున నన్నిటు
నీకడకుం జేర్చుకొనుట నెమ్మిం గద యో
పాకారిసేవితా! నను
జేకొని శాసింపుఁ డేమి చేయఁగఁ దగునో. 227

క. చేయందగుకార్యం బది
యీయదనున నేర్చుకొలఁది హితమని చేయం
గా యత్నించెద నాజ్ఞకు
నీయసురుఁడు వేచియుండు నెప్పు డధీశా. 228

చ. పలుకు లిఁకేల యాజ్ఞ యిడి పాదరజస్సము వీని ధన్యుగా
నెలమి నొనర్పుమా యనిన నెంతయు హర్షమునొంది కృత్య
మే, ఫలమును గాంచె నంచు మది భావనచేసి వచించె నెం
తయుఁ, సులలితరీతి నొప్పు నటు శౌరవరేణ్య! యనుంగు
మిత్రమా. 229

మ. దనుజాళిఁ వధియింప దేవతలు ప్రోత్సాహంబు గావింపఁ
గా, జననాథుం డగునయ్యజాత్మజునకుఁ సంతోషముం
గూర్పఁగాఁ, దనయుండై మధుసూదనుండు పొడమెఁ
దత్కృత్య మేరీతి వా, క్కునఁ బల్కంజనుఁ; దాటకఁ వన
మునం గ్రూరాత్ముఁడై కూలిచెన్. 230

చ. వినుము మఱొక్కవార్త మునిబృందము తఁ బురికొల్పఁ
దాటకా, తనయులయందు నొక్కరుని దర్పసమగ్రుఁడుగాక
బాలుఁడై, తను నెదిరింపనట్టి గుణధన్యుని నొండొకచోట

నుండియే, సునిశితబాణవేగమున శోణితంబడంగ నొనర్చెఁ
జూచితే. 231

క. మారీచునిఁ దత్సోదరు
మారుత తీవ్రాస్త్ర మేసి మదిఁ గరుణయొలే
కో రాక్షస! సంద్రంబున
భూరితరగ్రాహయుక్తిఁ బొల్చెడుచోటన్. 232

క. పడునట్లుచేసె, నింకను
గడుపుబ్బుట దండకాఖ్యకాననమునకుఁ
వడివచ్చి నాదుసోదరి
జడియక వికృతాంగిఁజేసె శస్త్రప్రహతిన్. 233

క. ఏమందుఁ గాలనేమీ
నాముద్దులసోదరిని ననాథను వనిలోఁ
దా ముక్కుచెవులు గోసెను
నామహితబలంబు వినియు నయమెడలి కటా! 234

ఉ. అంతట నాసహోదరియు నార్తిని గుంది వగం గృశించుచుం
జెంతనె యుండుసోదరుని సిద్ధపరాక్రమునిం ఖరాఖ్యదు
ర్దాంతమహారిప్రకరదారుణకాననదావపావకుం
సంతతయుద్ధకాంక్షుని విశాలజనస్థలవాసుధీరునిన్. 235

క. కనఁబోయి తనకుఁ బాటి
ల్లినకీడును జెప్పఁగా నిలింపారియు వే
యనుజులతో సేనలతోఁ
జని దురమొనరించి చనియె శమనునగరికిన్. 236

ఉ. ఏమనువాఁడ నింక విధి యిట్టులు కీడొనరింపఁబూని నే
మేమిప్రయత్నముల్ సలుప నెంచిన నవ్వి ఫలించునొక్కొ?

యా, భూమివరాత్మజన్ముఁ బగఁ బూని జయింపఁగ రాదటంచు
నే, మేము యుపాయముల్ వెదకి యెట్టులొ తెచ్చితి వాని
పత్నినిన్. 237

ఆ. ఆప్రయత్నమందు నాతాటకాపుత్త్రుఁ
డతనిబాణదీప్తి నంతమొందె;
రాముఁ డనుజుతోడ రమణికై విలపించి
చచ్చు ననుచు సీతఁ దెచ్చినాఁడ. 238

ఉ. నాదగు నూహ యట్టులు కనంబడెఁ గాని విధిప్రయత్న మిం
కేదొ యొనర్పఁ బూనుట నహీనపరాక్రమశాలి వాలి నా
భూదయితుండు భాస్కరునిపుత్త్రునిపంపునఁ జంపె; నంతఁ దా
రాదయితుండు వానరుల రామునిపత్ని వసించు తావునున్.

క. కనుఁగొని రండని పంచిన
హనుమంతుం డనెడుకోఁతి యస్మత్పురికిం
జనుదెంచి సీతఁ గని లం
కను గాలిచిపోయె నీవు కంటివిగాదే. 240

ఉ. ఆతఁడు పోయి చెప్ప విని యాకపిసేనలతోడ నబ్ధిపై
సేతువుఁ గట్టి వచ్చి మనశ్రీని హరింపఁగఁ బూని యెంతయున్
భీతి జనింపఁజేసి రిపుభీకరులన్ దనుజాతులన్ లస
త్ఖ్యాతులఁ జంపి; రంతనొకయాహవమందుఁ బరాక్రమంబునన్.

తే. శక్తిఁ బఱగించి రామునిసహజు లక్ష్మ
ణుని వధించితి దీనిచేఁ గనకుము తమి;
నతని బ్రదికింపఁ బూని యాహనుమ పవన
తనయుఁ డిప్పుడె ద్రోణభూధరమునకును. 242

క. చనుచున్న వాఁడు దానం
గనఁబడుసంజీవకరణి గంధర్వులు దా
నిని మఱివిశల్యకరణిని
గనఁబఱతురు నిర్జరేంద్రుకార్యము గానన్. 243

తే. మఱియు సౌవర్ణకరణిని మహిమ మెప్ప
నలరు సంధానకరణిని దెలియఁజెప్పి
వాని నిత్తురు హనుమయు భాస్కరుండు
నుదయగిరిఁ జేరకుండ సత్యుగ్రశక్తి. 244

క. చనుదెంచు; వానిమహిమముఁ
గనఁజాలుసుషేణుఁ డనెడుకపిపతి వానిం
దనువునఁ జేర్చిన లక్ష్మణుఁ
డనూనశక్త్యన్వితుండు నగుచుఁ బ్రదుకున్. 245

క. దానం నాదుప్రయత్నం
బౌ నిష్ఫల; మోసురారి యరసితి నిపుడే
నేనొక్కయుపాయంబును
దానిఁ వినవయ్య నేర్పు తగ నీవింకన్. 246

తే. ఇందు మసలక వేగంబ యేగి మార్గ
మధ్యమస్థితి దుర్గమమాయచేత
వింతయగుకాననంబుఁ గల్పించి యందుఁ
బర్ణశాలను నిర్మించి పరమనియతి. 247

క. మునివృత్తినుండు; మొకపలు
కును జెప్పఁగ మఱచినాఁడ క్షోణీస్థలిపైఁ
దనరారు నొక్కసరసది
యును దేవవినిర్మితమయి యొప్పుం జుమ్మీ. 248

తే. దానిసంపద వర్ణింపఁ దరముగాదు
ఫణిపతికి వాక్పతికిని గీష్పతికినైన
దానిఁజూచినమాత్రాన మానకందు
మునుఁగఁగాఁగోరు నెంతటి మూర్ఖుఁడైన. 249

క. అదిమంచిదియే గద యని
యెదవేమో యందుఁ జూడ నేరికి భీతి
ప్రదమై కనఁబడుమకరం
బదయతఁ గబళించు నెట్టి యాహవశూరున్. 250

క. కల దద్దానికి వర మ
ట్టులు కావున నదియు నటఁ గడుఁ దీరంబుల్
వెలయఁగ నుండును జుమ్మీ;
సులలితమునివృత్తిఁ బూని శుభవేషమునన్. 251

చ. పలువురు దానవుల్ మునులభంగిఁ జెలంగెడువేషముల్ ము
దం, బలవడఁజేయఁ బూని నిను నాదృతిశిష్యులరీతి గొల్వ ని
స్తులమహిమంబుగల్గు మునిధూర్జటి యాతఁ డనంగ నొప్పు
చుక్, గలుషము కానరానియటు కన్పడుచుక్ నివసింపుమీ
వనిన్. 252

చ. వనమది నూత్నసంపదలవర్ధిలుచుండుట మింటఁబోవు నా
హనుమయుఁ గాంచి యచ్చెలువు నందుచు మార్గమిదానొ
కాదొ క, న్గొని చను టొప్పు నంచును దిగుక్ సురమార్గ
మునుండి యాతపో, వనమున; కాతిథేయమున భవ్యమన
స్కునిఁజేయుమాతనిన్. 253

శా. ఏవో నాలుగుమాట లాత్మఁ బ్రమదంబేపొందునట్లాడుచుక్
భావం బవ్వనమందు నిల్పి రఘుభూపాలేష్టకృత్యంబు స్మ

త్యావాసంబు తో లంగిపోవునటు లుద్యద్బుద్ధిశక్తు ల్సన్నతిన్
నీ వెట్లో యొనరింపు మేల పలుకన్ నీతోడ సోమిత్రమా.

ఉ. చెప్పినదానిమించి మదిఁ జెందిననేర్పునఁజేయు నీకు నా
చెప్పినమాట లివ్వి కడుఁజిన్నదనంబునె కూర్పునేకదా
తప్పక నీకుఁ దోఁచెడువిధంబున గార్యముపండునట్లు నే
రొప్పఁగఁజేసి రమ్ము నిను నొయ్యనగౌఁగిటఁజేర్తు నోసఖా.

ఉ. ఈ:ని నాకు కాదు దితిజేంద్రులకెల్లను మేలుఁగూర్చు జూ
మ్మోపలలాశనా మది మఱొక్కవిధంబున నెన్నఁబోకు నా
యీపనిఁ జక్కఁజేసిన నహీనతరం బగుభాగ్య మబ్బఁగా
నేపునఁ జేయువాఁడ మఱియేమి తలంచిన నీకు నిచ్చెదన్.

చ. కరులు తురంగమంబులు నికామవిభూతి నెసంగు స్యందనో
త్కరములు రత్నముల్ మఱియుఁ గాంక్షను నెక్కినవేవి
యేమహాదరమున నిచ్చువాఁడ నని తప్పక నేశపథంబొనర్తు
ని, త్వరుణమునందుసాయపడిధన్యుని జేయుమునన్ను నేర్పునన్

చ. అని బహుమాన ముట్టిపడునట్లుగఁ బల్కిన రావణాశయం
బు నెఱిఁగి కాలనేమి మదిఁబోలఁదలంచి ముహూర్తమాత్ర
మొ, య్యన వచియించె; రావణ మహామతి వీవటులయ్యు
నివ్విధం, బునఁ జెడుమార్గ మూని కడుమూర్ఖునిరీతిని బల్కఁ
బాడియే. 258

—కాలనేమి రావణునకు హితోపదేశము చేయుట.—

సీ. దనుజశుష్కారణ్యదహనైకతత్పర
శరజాలదహనుండు శ్లాఘ్యవిభుండు
భయదశత్రుప్రాణపాథోధిశోషణ
దక్షరోషౌర్వుఁడు ధరణివిభుఁడు

పరవీరపత్తనభస్మసాత్కరణైక
వాంఛాత్రినేత్రుం డవనివరుండు
ధర్మేతరధ్వాంతదళనైకనిరతేష్ట
తీవ్రభానుండు ధాత్రీధవుండు
తే. పాపతూలానిలుండు కృపాపయోధి
యట్టి శ్రీరాముఁ దోడరి బ్రహ్మాదులైన
నిల్వఁ జాలుదురే యేల నీకు భ్రాంతి
గలిగెనో రాము గెలువంగఁ గల నటంచు. 259

చ. సురలు సురేంద్రముఖ్యులును శూరశిఖామణులైనదానవా
సురులును సిద్ధసాధ్యులును సూర్యులు రుద్రులు నుగ్రరీతి సం
గర మొనరింప నొక్కటిగఁ గ్రందుగవచ్చి తలంపడంగ భూ
వరతనయుం డొకండె శరవర్షమునన్ మడియించు నందఱిన్.

క. అమృతముఁ ద్రావిన దేవత
లము మేమను గర్వమునఁ జెలంగుచు ననిచే
యు మమతరా రామునిబా
ణము లోర్వక చంపు దనుజనాథా! వినుమా. 261

చ. మును రఘురాము మార్కొనిన భూరిబలాఢ్యులు దానవో
త్తముల్, చనిరి గదా పరేతవిభుసద్మనివాసముఁ గోరి నీవ
లెన్, జెనటితలంపుఁ జిత్తమునఁ జేర్చెడువాఁడు ధరిత్రిఁ గల్గు
నే, చను మిఁకఁ జాలుజాలు నసుసంతతి నిల్వఁగఁ గోరియు
న్నచోన్. 262

చ. తనయులు బాంధవుల్ సఖులు తమ్ములు నింకను గల్గుయో
ధులున్, మనముల నీదుమాటలకు మాఱు వచింపఁగ నోడి
యుద్ధభూ ,మిని బడుటెల్లఁ గాంచియును మిన్నకయుండక

నన్నుఁగూడఁ జం,పను దలపోసివచ్చితివె బంధువవే తలఁపంగ
రావణా. 263

చ. ఒకఁడవు నీవు పుట్టి దనుజోత్తమసంఘము నెల్లఁ గూల్పఁగా
నకట! తలంచి తిట్లు; త్రిదశారులు నీకొఱకై రఘూత్తమ
ప్రకటితమాంబకప్రకరబాడబరోచులఁ గాలిపోయి; రో
వికటమతీ! త్రపంగనక వీరుని భంగిని మాటలాడెదే. 264

శా. మారీచుండు ఖరుండు దుర్ముఖుఁడు దుర్మానైకచిత్తుండు దు
ష్ప్రారంభుం డనువేరుఁ గాంచి కడుదర్పం బొప్ప యుద్ధా
వనిన్, వీరుండౌ త్రిశిరుండు రాఘవునివా భీమాస్త్రశస్త్రంబు
లన్, ఘోరం జావరె యవ్విధం బెఱిఁగియున్ బొమ్మందువే
నన్నునున్. 265

శా. చాలుంజాలును; నీకు నియ్యదె నమస్కారంబు పోపొమ్ము
నీ, మేలుం గోరెడివార లున్నయెడకున్ మిత్రుండవే యం
చు న్నే, లోలోనం దలపోయుచున్ బ్రదుకుదున్ లోలాక్షి
శ్రీదేవి, ని,న్నేలా మోసముచేయకుండునిఁకఁ గీడేదో త్వరన్
వచ్చెడిన్. 266

చ. హితము తలంచి వచ్చితివయేని దశానన! నీపురంబు ను
ద్ధతిమెయిఁ జొచ్చి జానకిని దత్థ్సితియంతయుఁ గాంచి నీవ
నం, బతులితశక్తిఁ గీడ్పఱచి యవ్వనపాలకరాజఁ ద్రుంచి నీ
సుతవరు నక్షుఁగూల్చి రణశూరులఁ బల్వురఁ జంపి ధీరుఁడై.

క. తనసరిలే కలరా రెడు
హనుమంతుని మేఘనాదుఁ డజునివరమునం
గొనియున్న యస్త్రవర్యం
బున బంధించెను వధింపఁ బూనియుఁ గంటే. 268

క. వనజాసనాస్త్రబద్ధుం
గొని తెచ్చిరి గాదె నీదుకొలువున కంతట
హనుమంతుఁడు చెప్పెను నీ
కనువుగ నీతితతిఁ గ్రోధ మందితి దానన్. 269

చ. అనుజుఁడు సాధుమార్గముల నారసి తెల్పఁగఁ దోఁకఁ గా
ల్పఁగాఁ, బనిచితి వామరుత్సుతుఁడు బల్మి నిగింకరరాజిఁ జంపి
ప, త్తనమును గాల్చిపోయెఁగద దర్పము చూప వదేమొ
యప్పు; డా, హనుమయె యిప్పుడేగెడు మహాగతి నాతని
నాప శక్యమే. 270

ఉ. మాయలు పన్ని యాహనుమ మార్గము నాపుమ యందు
వేమొ యీ, మాయలు గీయలెల్లఁ బవమానతనూజుని
ముందు సాగునే, మాయసురేంద్ర నీకొమరుఁ డుద్ధతుఁ
డెన్నియొ పన్నెఁ గాదె దు,ర్మాయలవానిచే ఫలము మాట
యటుండఁగ నీల్గె నాతఁడే. 271

తే. కుంభకర్ణాదివీరులు కూలి రాత్మ
భవులు మ్రందిరి జ్ఞాతులు ప్రధనభూమిఁ
బడిరి సుభటులు చచ్చిరి. బ్రదికియున్న
వాఁడ నీవొక్కఁడవె వీరవరులలోన. 272

చ. కలహము పొందెఱుంగక నికామభయంబున నిల్లుదాఁటకే
లలనయుఁ బుత్త్రులుం గడువిలాసమునం జరియింప వారి ని
క్కిలి తమిఁ గాంచుచున్ గృహమె కేవలమోకుని కేతనం
బుగా, నెలమిని నమ్మియున్న నను నేల వృథా బలియీయఁ
జూచెదో. 273

చ. పురివిడనాడి యెచ్చటికిఁ బోమ్మని పంచినఁ బోవువాఁడ దు
ర్భరబలశాలియా పవనుపట్టికి నడ్డము పోవఁజాల ని
ష్ఠురమును జొచ్చువేళ నెటుపోయెద వేటి కటంచు లంక
ని, ష్ఠురముగఁ బల్కి ముష్టిహతిసోలి శరీరముఁ బాయదే
విభూ. 274

తే. అట్టిబలశాలి కతినాత్ముఁ డనిలతనయుఁ
డతనిముష్టికి బలినీయ నాత్మఁ దలఁప
కించు కంత దయఁ బూని యింకనేమి
పనికిఁ బనిచినఁ జనియెదఁ బ్రభువరేణ్య. 275

తే. వయసుచెల్లినవాఁడను బలుకరాని
కష్టములనొంది యిపు డెట్లొ కాంతఁ బుత్త్ర
పుత్త్రికలఁగూడి సంసారయాత్ర జరపు
కొనుచు నున్నాఁడ నను నేల పనుతు విట్లు. 276

క. హనుమంతుఁ డన్నమాటయు
వినఁబడ హృదయంబు మిగుల విహ్వలతం గాం
చెను జూమ్ము రావణా ననుఁ
బనికిం బన్పకయె పొమ్ము వచ్చినత్రోవన్. 277

చ. నను నిటు ధిక్కరించెదవె నాథుఁడ నాటను బంచినట్లు చే
యను జనుఁగాని మార్పలుక న్యాయమె యందువొ యే
మొ రావణా, తనువు ధ్రువం బటంచు నొకతన్విని బెండిలి
యాడి పుత్త్రులం, గని సుఖమందువాఁడ నటుగావున వేఁడె
ద నీకు మ్రొక్కెదన్. 278

ఆ. తుచ్ఛకార్యములను దొందఱపడిచేసి
ఫలముఁ గాంచినాఁడఁ బ్రభువరేణ్య

యిపుడు వానిమాని హితగతి నున్నాఁడ
బ్రదుకు శాశ్వత మనుభావమూని. 279

చ. కరములమోడ్చి నీదు పదకంజములందు శిరస్సుచేర్చి యీ
పురముననుండ నిమ్మనుచు భూరిభయార్తుఁడ నంచు మ్రొ
క్కెదన్, సురరిపునాథ! నన్నిపుడు శూరుఁడుగాఁ డితఁ
డంచు నెంచి యేఁ, గరుణనుబూనియేఁ జనుము కాని ప్రయ
త్నము చేయుమం చనా, దరమున నాజ్ఞచేయకుము ధన్యుఁ
డ నాదును నీకు మేలగున్. 280

చ. వినుమొకమాట చెప్పెదను వృద్ధుఁడ నౌటను జాలఁగష్ట
ముల్, దినదినముం గనుంగొనుచుఁ దీఱనిదుఃఖములన్ భరిం
చితిం, గనుక సురారినాథ! రఘుకాంతుఁడు విష్ణువు నిన్నుఁ
జంపఁగా, జనిఁ గనినాఁడు వానరులు సాయము చేసెడు
వారు గావునన్. 281

చ. మృతిఁగనువాఁడ వీవు రణ మెన్నఁగ నీకు శుభప్రదంబుగా
దతిశయరోష మొందుటయు నర్హముగా దిటువంటికాల
మం, దితరులు తెల్పునీతులను నెప్పుడు నమ్మకు నాదువాక్య
మున్, జతనము మీఱఁగా నిలుపు స్వాంతమునందు శుభం
బుగ లైడున్. 282

క. ఐన దదేమో యైనది
కానున్నది కాకమును పె ఙ్మాపాలవరున్
శ్రీనాథుని శ్రీరాముని
గానం జనవయ్య బుద్ధికౌశల మొప్పన్. 283

క. జనకకుమారి యనంగా
వనజాలయ సీత యనఁగఁ బరఁగెడుఁ గాన

వినయము భక్తియు నొప్పం
గను నాసాధ్వీమతల్లిఁ గైకొని యిపుడే. 284

చ. చని రఘువంశవారినిధిచంద్రునకుం దమి నప్పగించి చే
సినయపరాధముల్ మఱచి చిత్తమునం దనుకంప మానుమా
పనజదళాక్ష! యంచు రఘువర్యుని వేఁడుమునిన్నుఁ గాచు నా
యనఘుఁడుక్రోధమూనఁడభయప్రదుఁడౌట ధ్రువంబు రావణా.

ఉ. వింటిని మున్ను సాధుజనబృందము చెప్పఁగ రామమూర్తి
యే, పంటవలంతియందుఁ బ్రభవంబును గాంచి మహాసురా
వళిన్, గంటకభూతముం దునిమి త్రైసురమానులభీతి
మాన్పి వాల్గంటిని సీతఁగూడి సురకాండము లెల్ల నుతించు
చుండఁగన్. 286

మ. అలవైకుంఠముఁజేరు నంచుఁ ద్రిదశేంద్రారాతినాథా! మ
దిం, గల యీవాక్యముఁ జెప్పినాఁడ వినెదో కాదంచు
మాఱాడెదో, యలుకంబూని యథాప్రకారముగ నీచా
రభ్రకార్యాళిను, జ్వల తేజంబును నమ్మిచేసెదొ వచింపంజాల
కున్నాఁడఁ జూ. 287

చ. అని యిటు లాత్మశక్తియిసుమంతనిదెయించకగొప్పమాటలన్
దనుజగణేంద్రుచిత్త మొగి దారుణకోపము నొందునట్లు
చెప్పిన విని యాగ్రహంబునఁ గ్రపీటజనిన్ గడు ధిక్కరిం
చి నేత్రనిచయ మల్లె నిప్పుకలు గ్రక్కఁగ నొక్కట భూమి
కుటుల్ తగన్. 288

ఉ. హుంకృతినాద మెల్లెడల నుగ్రరవంబును బుట్టఁజేయఁగా
సంకటకారి రావణుఁడు చయ్యనఁ గోశమునుండి ఖడ్గమున్

బింకము మీఱ లాగి క్రుధవిహ్వలతం గనుచిత్త మెప్ప ని
శ్శంక వచించె నిట్లు; ఘనశౌర్యము గల్గిననన్నుఁ దుచ్ఛుఁడా.

మ. నరమాత్రుం డగురాము దైవ మనుచున్ నాతప్పు మన్నించి నీ,
తరుణిన్ సీతను గైకొనం జను దయన్ ధన్యాత్ముఁగాఁ
జేయు మ్మాదర మొప్పంగ నటంచు వేఁడుమనుచున్ ధర్మో
పదేశంబు న్యాయరతిం గల్గిన నీవొనర్చితివె మేలౌ నీనుడు
ల్ నాకిటన్. 290

ఉ. కాలము సుంత వ్యత్యయముగాఁ గనుపట్టుట నిన్నుఁబిల్చి
యీ, కాలమునందు సాయపడఁగాఁదగు నివ్విధి నంచుఁ
బల్కినం, జాలుదు నిట్లు చేయఁగను జాలను దీని నొనర్ప
నంచు నీ, వోలి వచింపఁగాఁదగుదు వో రనిశాచర! భక్తి
మీఱఁగన్. 291

ఉ. అంతియకాని నా కిట మహామతిమంతుఁడువోలె నీతు లి
ట్లింతర మించు కేఁదెలియ కాడెదవే కుమతీ తలంప నీ
యంతటివారు వేలుగ మదంఘ్రులఁ గొల్చుచు నుండు టెల్ల నీ
స్వాంతమెఱుంగదే తులువ చందమునం బలుకంగఁ బాడియే.

చ. సురలను దోలి కిన్నరుల సోలఁగఁ గొట్టి నిశాధినాథులన్
గరువము మాని నాదుపదకంజములం గొలువంగఁ జేసి యా
శరుల నదల్చి దానవుల శౌర్యముఁ బాపి నరేంద్రకోటిసం
గరమునఁ జంపి సాటియనఁగాఁదగువాఁడు జగత్త్రయంబునన్.

క. వెదకినను లేకయుండం
గ దర్పమున నొప్పునన్ను గర్వంబున భూ
మిదయితుసూనుని పదముల
కుఁ దలల్ సోఁకంగ మ్రొక్కఁగూడదె యనుచున్. 294

క. ఏమేమో తోఁచినగతిఁ
గా మాటలు పల్కి తీవు కాదన కిచటన్
నీమస్తకంబు దీనికి
నేమంబున నిత్తు బలిగ నీచమనీషా. 295

తే. తులువపల్కుల కిద్దియే ఫల మటంచు
ఖడ్గ మెత్తినఁ గన్గొని కాలనేమి
యేమి రావణ! నీమది నెఱుఁగఁగోరి
పలుకు నన్నే వధింపఁగఁ బాలుపడుదె. 296

క. మిక్కిలి కష్టము లోలయఁగఁ
జక్కని ధైర్యంబు నిల్వఁ జాలదు నీకుం
దక్కఁగ నితరుల కది యవు
డెక్కరణిని దగునో యనుచు నేఁ బరికింపన్. 297

క. దనుజకులంబునఁ బుట్టిన
ఘనునకు నీ కిట్టియెడ నఖండతరంబై
తనరారువిక్రమము త
గ్గెనొకో యనుచింత మదిని గీడ్పడుపంగన్. 298

క. కులమందలి యభిమానము
గల నేనిటు నిన్ను మిగులఁ గఠినంబులు గాఁ
దలఁపందగుపల్కుల నర
సి లలిన్ సంతృప్తిమదిని జెందెదునన్నే. 299

ఆ. చిన్ననాఁటనుండి చెప్పినపను లెల్ల
నాదరమునఁ జేయు ననుచు నైనఁ
దలఁప కింతమాత్ర దారుణఖడ్గసం
హతిని ద్రుంపఁబూను టర్హ మగునె. 300

క. వినవయ్యా! దశకంధర
హనుమంతుం డనఁగ నెంత యారాఘవులం
గాని తెమ్మన్నను దెచ్చెద
ననుమానం బేల తెల్పు మభిమత మెల్లన్. 301

క. నీవే యాజ్ఞాపించిన
నే వారక చేయకుందునే దశకంఠా
యేవిధిఁ జేయం జను నన
నావరుసనె చేయువాఁడ నది నాపనిగన్. 302

చ. చనియెద నిప్డె యాహనుమ సంతసమంది ప్రయాణ మాపి
నా, వనమును గాంచునట్టి దగు వైఖరి మీఱ నొనర్తు సృష్టి
నూ, తన మిది యెందు నేఁ గలదె ధాత్రిని నిట్టి తపోవనం
బటంచును వెఱగంది దేవతలుస్తోత్రము చేసెడు నట్లు చేసెదన్.

చ. సరసదిగ్రాహయుక్తముగ సాధ్వసదం బయియుండు నెందు
నా, ధరణిఁ దపోవనంబును నితాంతమనోహరపక్షిసన్మృగో
త్కరనిబిడంబునై వెలయఁగా నొనరించి తదంతరంబునం
దుసుతరపర్ణశాలఁ గన నొప్పులు గుల్కఁగ సృష్టిచేసెదన్.

ఉ. అందు శ్రుతిధ్వనుల్ వెలయునట్లుగఁ జేయుచు శిష్యకోటిగా
నందగిన ట్లొనర్చెద ననన్ దశకంధరుఁ డట్టె నవ్వి చే
నందినఖడ్గముల్ వదలి యక్కట! నీవచనార్థ మింతయే
డెందమునం దలంపక కడిందిమగంటివిమీఁ బూని యుత్తటిన్.

తే. చంపఁబూనితి నీదువచనములందుఁ
గలమహార్థము తేటగాఁ దెలిసె నిప్పు
డింకఁ దడ వేల? త్వరఁగఁ బోయి యలహనుమ
నడ్డగింపుము ద్రోణాద్రి కరుగకుండ. 306

ఉ. చక్కనిమాటలందగిన సాధుసపర్యలమోసపుచ్చి నీ
రెక్కడ చిక్కనో యనఁగ నెట్టులొ చేసి సరోవరం బిదే
యిక్కడ నున్నదంచు నటకేగెడుయుక్తిని బన్ని యిందుఁ జే
రుక్కన నున్న గ్రాహమునకొక్కటఁ బావని చిక్కనట్లుగన్.

క. ఒనరింపు మంత గ్రాహము
హనుమంతుం బట్టి మ్రింగు నద్దాని వధిం
పను శక్యము కా దెరికి
వనజాక్షునకైనఁ బద్మభవునకు నైనన్. 308

క. మరుదాత్మజుఁ డట నీల్గిన
గరువం బెడలంగఁ గీశగణములతో భూ
వరుఁడున్ లక్ష్మణుఁ డేగిన
సరణిం బోవుదురు మనకు జయము గలుగుఁ జూ. 309

చ. అని విని కాలనేమి తనయాత్మఁ దలంచెను వీనిచేతఁ జ
చ్చిన నరకంబె కల్గెడిని జేరఁగరాదు దివంబు రామచం
ద్రునిపదభక్తుఁడై మహిమతోఁ దగుపావనిచేతఁ జచ్చినన్
గన నగునింద్రలోకమును గాన వెసంజనువాఁడఁజావఁగన్.

ఉ. ఇంటను గాపురంబుగను ఏర్పడ నున్నగదా తలంపఁ నీ
రెంటను మేలు పోవుట యరిప్రకరాంతకుఁడైనపావనిన్
మింటను బోవువానిఁ గడునేర్పునఁ గ్రిందికి రాఁగఁజేసి నా
తుంటరివిద్యచే నతనిఁ దోయము లానఁగఁ బోవఁజేసెదన్.

శా. దానన్ గ్రాహముచేతఁజిక్కిమృతినొందన్ రాజ్యలాభంబె కా
దే నాతండు మదీయచిత్తగతదుర్వృత్తిన్ విచారించి యం
దే నన్నున్ వధియించెనే సురపదంబే పొందఁగాఁగల్గెడున్
గానంబోయెద వీనిచే మృతి గనంగా నాత్మ చింతిల్లెడిన్.

చ. అని తలపోయునంత దనుజాధిపుఁ డిట్లను గాలనేమి నీ
మనమున నెద్దియో తలఁచుమాడ్కిఁ గనంబడుచున్న దన్న నా
తనిఁ గనినవ్వుచుం బలికెఁ దత్త్వము దెల్పెద నేమిమాయ ప
న్ననుజనునంచు నెంచెదనునామది వేఱొకయూహ లేదు సూ.

క. ఇఁక నిచట నాలసించుట
యొకదా కీడునకు మూల మిదె పోయెద నీ
కకలంకయశముఁ గూర్పఁగ;
సకలారాతుల వధించి జయముం గొనుమా. 314

క. జయముఁ గొని కాని రా నిట
కయశమ్మున బ్రదుకఁజాల నసురాధ్యక్షా
దయ యునుపు నాకుటుంబము
పయిఁ జూతునో లేదో నిన్నుఁ బలుకు లిఁకేలా. 315

క. అని కన్నీరు ప్రవాహం
బనఁబాఱఁగఁ దన్నుఁ జూచునాతనిఁ బ్రీతిం
గని భీతిల నేటికి నీ
కనుపమశుభ మబ్బు వేగ యరుగుమటంచున్. 316

క. కరములఁ గౌఁగిటఁజేర్చిన
సురవైరికి మ్రొక్కి మరలి చూచుచు నిఁక నీ
పురిఁ జూచుట కల్లయొ ని
ర్జరపురిఁ జూచుటయొ నాకు రాఁదగుఫలమా. 317

చ. అని తలపోయుచుం జనియె నంతట రావణుఁ డాశ వెంపునం
జని సుఖనిద్ర నొందె; జవసత్త్వము లొప్పెడు కాలనేమి
యొ; క్కనిముసమాత్రలో నరిగి కంధిసమంబగు తత్సరోవరం
బునకు సమీపమందె తనబుద్ధిచమత్కృతి యొప్పునట్లుగన్.

సీ. కృతమాలహింతాలవితతనమేర్వాది
కామలచ్ఛాయాద్రుమావృతంబు
మందారనీపాదిసుందరపరిమళ
ప్రసవభూషితవృక్షరాజితంబు
కంటకఫలసహకారమోచాముఖ
సత్ఫలావనిరుహసముదయంబు
మాలతీచంపకమల్లికాప్రముఖప్ర
సూనరాజల్లతామానితంబు
తే. శ్రవణసుఖకరమృదుగళస్వనమనోజ్ఞ
శుకపికాదికసత్పక్షినికరయుతము
నై చెలంగఁగ శాంబరి నాశ్రయించి
వనము నిర్మించె దానవవరుఁ డతండు. 319

సీ. తరువరచ్ఛాయలఁ దనువు కన్పడకుండఁ
దపము సల్పెడునట్టి ధరణిసురులు
శ్రుతినాదముల దిగ్వితతి నించుచుఁ నిష్ఠ
నలరారు భూదివిజులవితతులు
పరమేశ్వరధ్యానపరతంత్రులై నష్ట
యోగాసనము లూను యోగివరులు
తత్త్వమస్యాదివాక్యార్థమహార్థంబులఁ
దెలుపుచున్నట్టి జ్ఞానులగణములు
తే. తనరుచుండంగఁ బావనతమము నగుచుఁ
జూచు ఖేచరు లెల్లరుఁ జోద్యమంద
నచట నక్కాలనేమి మున్యాశ్రమములఁ
జెలఁగు నొక్కవనంబు సృజించె నపుడు. 320

వ. మఱియు న త్తపోవనంబు జ్యోతిశ్చక్రంబువలె వివిధఖేచర నిచయప్రచురంబై మేరుభూధరంబుభాతి సమంచితకాంచన కూటబహుళంబై యమరావతీనగరంబుభంగి రంభా [1]హారిణీ [2]కాంతా ప్రముఖ [3]గణికామనోహరంబై, వైకుంఠంబు వోలె [4]లక్ష్మీ [5]నారాయణసన్నిధానంబై, కైలాసంబువో లిక [6]శివ [7]పార్వతీయుతంబై, సత్యలోకంబువడువున [8]బ్రాహ్మీ ప్రభావమహితంబై, గోలోకంబుకరణి [9]రాధా [10]కృష్ణ ప్రధానంబై కన్నులపండువు చేయుచునుండె. 321

క. ఆకాలనేమి బహువిధ
యాకలితమనీషఁ డగుట హారిరవంబుల్
చేకొని రేయింబవలును
బ్రాకటగతిఁ జేయుపతివర్యము లలరన్. 322

చ. తరువరముల్ నభోంగణముదాఁకఁగఁ బౌరుషమూనిచక్కఁగా
బెరిఁగి శశాంక భాస్కరులు వేడుకఁబోవుట కడ్డ ముండరా
దరసిన నింద గల్గునని యప్పనిమానె ననంగ వర్ధిలన్
నిరుపమశక్తిఁ జేసె నొకనిర్మలకాననమందు నొక్కచోన్.

చ. మృదుతరశాఖలం బెనచి మించుచమత్కృతి యొప్ప నాకు లం, జిదిమి సమంజసంబుగను జేరిచి కూరిచి పర్ణశాలనాఁ గఁదగినపేరు సార్థకముగా విలసిల్లఁగ నాశ్రమం బొన ర్చెఁ దనకుఁ గల్గుశక్తిమెయి శిల్పివరుల్ తల లూచి మె చ్చఁగన్. 324

---

1 హారిణి=అడవిమొల్ల. 2 కాంతా=ప్రేంకణము. 3 గణికా=నెల్లి చెట్టు. 4 లక్ష్మీ=మెట్టదామర. 5 నారాయణి=జామచెట్టు. 6 శివ=జమ్మి. 7 పార్వతీ=అందుగుచెట్టు. 8 బ్రాహ్మీ=బారంగిచెట్టు. 9 రాధ=విష్ణుక్రాంత. 10 కృష్ణ=ద్రాక్షతీఁగ.

తే. అందు దివ్యాసనముల నింపొందఁ జేసి
యున్న వేదిక యున్నతి నొప్ప నలవ
రించె నద్దానిక్రింద నిర్మించె శిష్యు
లమరఁ గూర్చుండి యోగంబు లభ్యసింప. 325

క. శ్రుతిపాఠంబులు చెప్పుచు
వితతారవముల్ చెలంగ వేడుక సామ
శ్రుతిగానమ్ము లొనర్చుచు
శ్రుతిసుతబాలకులు మిగులఁ జెలఁగిరి దానన్. 326

క. ఎప్పుడు మారుతపుత్త్రుం
డుప్పరమునఁ బోవు నొక్కొ యురుతరమౌ నీ
చప్పుడు విని వేడుకపడి
యిప్పావనస్వామిఁ జేర నేతెంచునొకో. 327

క. అని తలపోయుచు శిష్యులు
పనివడి వేదధ్వనుల్ నభంబున వెలయం
గనుజేయ నాజ్ఞ నిడె నా
దనుజుండు మాయాబలమునఁ దత్సమయమునన్. 328

ఆ. ఆతపోవనంబునందు నీరీతిఁ బా
వనికి విఘ్న మొనరఁగ నొనరించు
పరికరములు సిద్ధపడియె నచ్చట వాయు
తనయుఁ డంబురాశి దాఁటి యవల. 329

చ. వనజసఖాన్వవాయగురువార్ధిశశాంకుఁడు దీనలోకపా
లనకృతదీక్షుఁ డున్నతవిలాససమాహవుఁ డర్థిలోకపా
వనసురభూరుహంబు నయి వర్ధిలు రాఘవుపాదపద్మముల్
తనమది నిల్పియుత్తరపుఁదట్టు కనుంగొనితోఁకఁ ద్రిప్పుచున్.

చ. పవనుని లోఁ దలంచి గురువర్యుని భాస్కరు సన్నుతించి శ
క్తి వఱలఁ బోయె ద్రోణగిరికిన్ సురలెల్ల నుతించుచుండ ని
ట్లవితథకాంతుఁడై చనుచు నాహనుమంతుఁడుపర్వతావళిన్
బ్రవిమలనిమ్నగావళిని రమ్యవనంబుల దాఁటి యంతటన్.

చ. చని చని యొక్కచో విపులశైలముఁ గాంచి తదీయశృంగ
ముల్, పనిపడి చంద్రభాస్కరులపద్ధతి నాఁగ వృద్ధినొందె
నో, యనునటులుండ నచ్చెరువు నందుచుఁ గాంచి నను
స్కరించి యీ, శివను నివాసభూతమయి శోభిలు నిద్ది హి
మాలయంబె యగా. 332

తే. శిఖర మియ్యది వెండిచేఁ జేయఁబడియె
నంచుఁ దోఁచెడిఁ గైలాస మనఁగ నిదియె
నిందుశేఖరుఁ డిందుమ నెలమిఁ గూడి
సనకముఖమౌనివర్యులు సతము గొలువ. 333

ఆ. అజరుఁ డక్షరుండు హతవైరి సర్వజ్ఞుఁ
డాదిదేవుఁ డక్షరాహ్వయుండు
సర్వరక్షకుండు సర్వేశ్వరుఁడు నన
వినుతిఁ గాంచు శివుఁడు వెలయుఁ గాదె. 334

చ. అని మది నెంచి యంధకమహాసురసంహరణా! మహాత్మ నేఁ!
జనియెద నిప్డు రామనృపచంద్రుని కార్యము నిర్వహింపఁ ద్రో
వను గిరియందు విఘ్నసముదాయముగల్గిన నాశమొందు న
ట్లనుపమసత్కృపానిరతి నాశిష మిమ్మిదె నీకు మ్రొక్కెదన్.

చ. పరశివ! నీకు మ్రొక్కుటయె పండును గార్యము లంచుఁ
దెల్పెదుర్, నిరతము భక్తరక్షణమె నీపని గావున రాము
కార్య మిగా, వరుస ఫలింపఁజేయుమని వారక వేఁడఁగనేల?

పార్వతీ, శ్వర! కరుణాసముద్ర నిను సన్నుతిఁ జేయఁగ
నాకు శక్యమే. 336

క. అని తలఁచుచు మ్రొక్కుచు నీ
శునిపత్ని హిమాద్రిరాజసుతఁ గరుణాబ్ధిన్
మునిసంఘపూజితాంఘ్రిని
మనమున స్మరియించి మ్రొక్కి మహితాత్ముండై. 337

క. ప్రకృతివన నీవె తల్లీ
సకలచరాచరములెల్ల స్వాంతంబున నీ
వొకపరి తలఁచిన వెలయును
నొకక్షణ మూరకయొయున్న నొందు లయంబున్. 338

క. కనుకం బ్రార్థించెద ని
న్ననయము శ్రీరాముకార్య మగు నిది దీనిన్
దనుజులు విఘ్నంబులచే
తను సాగకయుండఁజేయఁ దలఁతురు కానన్. 339

క. కరుణావారాశివి నీ
వరయఁగ నొకమాఱు తలఁచినంతన సాగున్
సురవైరి భయము తొలఁగును
గిరివరపుత్రీ! యటంచుఁ గేలు మొగిడిచెన్. 340

తే. ఇట్లు పార్వతి నీశాను నెదఁ దలంచి
యాగిరిని దాఁటి యవ్వల నరిగి యరిగి
దుగ్ధసాగరవర్యముతోఁప నిలిచి
కరయుగంబును ముకుళించి గాలికొడుకు. 341

ఉ. పాలసముద్రమా! భవదపారమహత్వము నేమియందు? నీ
పాలఁగదాజగత్పతి, ప్రపంచము లంతము నొందువేళ జీ

వాళులు బీజరూపమున నాత్మను సంస్థితిఁ గాంచుచుండఁ దా
నోలివలైకపత్రమున నొక్కఁడయై పవళించి యుండుటల్.

ఉ. దీనిని మించుభాగ్యము మదిం దలపోసినఁ గల్గనేర్చునే
కానఁగఁజాల నీసమతఁ గాంచినవారల లోకమందు; నే
దేని భాసంగుఁగాని పరమేశ్వరుఁడే శయనించుభాగ్యమే
పూనదు కల్గదాని సరిపోలెడునట్టిది లే దదేదియున్. 343

తే. అట్టిభాగ్యము నీయందె యమరియుంట
వర్ణనాతీత మిది యని పలుకవలెనె;
యట్టిభాగ్యంబు గల్గినయట్టి నీకు
మ్రొక్కుచున్నాఁడఁ జుమ్మీ వె దిక్కటంచు. 344

క. శ్రీరాముకార్య మిదె నా
యారంభించినది దీని కారయ నష్టం
బేరీతిఁ గలుగకుండఁగఁ
గోరిక నాశీర్వదింపు కొనసాగుగతుల్. 345

చ. అని యిటు లబ్ధివర్యమును హర్షమునం గొనియాడి యవ్వలం
జని చని క్షీరసాగరము చక్కఁగఁ ద్రోవ నొసంగెఁ జేయఁబూ
నినపని దైనయట్లె యని నిర్మలబుద్ధిని నిశ్చయించి యం
త నతఁడు వాయువేగమున దాఁటె మహావనపర్వతావళిన్.

ఆ. చాలదూర మేగి చంద్రపర్వతమును
గాంచి యిదియె కీశగణవరుండు
జాంబవంతుఁ డెలమిఁ జక్కఁగఁ దెల్పిన
భూధరంబు దీనిఁ బోలఁగంటి. 347

క. దీనిమహోత్తరశృంగము
లే నింగిని దాఁకుచున్న వింతలిశిలలుౘ

గానంబడుశశివర్ణము
లై నిర్మలరీతిఁ గాన నభిధానముచేన్. 348.

తే. చంద్రగిరి యనఁబరఁగుచు నింద్రపురిని
సిరుల గేలి నొనర్చెడుఁ జేరినాఁడ
ద్రోణగిరిదాపునకు, దీనితోడ నాదు
కార్యమును దెల్పి యరిగెదఁ గడమపనికి. 349.

క. అని తలఁచి చంద్రభూధర
మునకుఁ వందన మొనర్చి భూమీధ్రంబా
నినుఁగొల్చెద ద్రోణాద్రికిఁ
జను నాపని ఫలముఁ గాంచ సమ్మతి నిమ్మా. 350

క. నీనామము సార్థకముగఁ
బూనం దగురాముకార్యమును జేయంగా
నీనిర్మలాశయము గొని
యే నరిగెద నటకు లోకహితము నొనర్పన్. 351

క. అని యిటు లభ్యర్థించుచుఁ
జని యాగిరికిఁ సమీపసరణిరుచులచే
తను సూర్యలోక మట్లుగఁ
గనఁబడు ద్రోణాచలంబుఁ గాంచెఁ వేడ్కన్. 352.

చ. కనుఁగొని చెంత నున్న యటుగాఁ దలపోసి నమస్కరించె నా
ఘనగిరి యంత దాపునను గాక సుదూరమునందె యుండె నం
దును నెలకొన్న యాలతలుదూరమునుండి కనంగ భాస్కరాం
శునికర మిన్నిరూపముల శోభిలుచున్న విధంబు తోఁపఁగన్.

ఉ. మండుచునుండెఁ; గావుననె మారుతి యాగిరిచెంత నున్న
య, ట్లుండ జవంబునం జనఁగ నొప్పు నటంచుఁ దలంచెః.

నిట్టు లుద్దండతరాంశుమాలికలఁ దద్గిరివర్యము పెక్కుసూ
ర్యు లొండొండ వసించియున్నవిధ మూహాను రాఁజనున
ట్టు లొప్పుచున్. 354

క. ఖచరులు యక్షులు కిన్నర
నిచయము గంధర్వరాజి నెఱిఁ దన్గొలువం
బ్రచురతరవైభవంబున
నచలేంద్రం బనఁగఁ గీర్తి నలరుచు నుండెన్. 355

చ. ఘనతరకందరావళులఁ గాంతలఁగూడి వియచ్చరుల్ ముదం
బున నివసించి స్వర్గపురముం జనఁ గోరక యుండుటల్ మ
నం, బునఁ దలపోయ నేరికిని భూధరవైభవ మెంతయో
తనం, తన తెలియంగవచ్చుఁగద ధన్యమునం జనువస్తువట్టిదే.

తే. అట్టి ద్రోణమహీధరం బంతికమున
నున్నయటు లెంచి పావని యుబ్బి యింకఁ
గార్యమెల్ల ఫలించె రాఘవపదాబ్జ
వందనముచే నటంచు జవంబు నిలిపి. 357

మ. ధరణిం జూడఁగ నొక్కదివ్యవన ముద్దామశ్రుతిఖ్యానసుం
దరమై కన్పడెఁ దానిఁ గాంచి యిదియా నవ్యంబు ముం
దేను భూవరుమ్రోలం బ్లవగేశ్వరుండు వచియింపఁగ విన్న
చందంబుగా, కరయం గ్రొత్తదిగాఁ జెలంగెడిఁగదా యా
త్రోవ వేఱొక్కచోన్. 358

క. చనియెనొ యేమొ మహాజవ
మున వచ్చుచు బుద్ధిలోపమున మార్గంబుం
గనకుండ వేఱుమార్గం
బున వచ్చితినో యిఁకేది పోలును జేయన్. 359

క. వనచరుఁ డీతఁడు బుద్ధిం
గనఁ దక్కువ యనెడిపల్కుగా దన్నతం బం
చును సిద్ధాంతముచేసితి
జని సాధారణప్రవృత్తిసమయ దదెట్టుల్. 360

క. త్వరపడివచ్చుచు మూర్ఛాం
తరమునఁ బడినాఁడ ననుచుఁ దలఁచెద లేదే
సురుతరవన మిది యుండిన
హరివర్యుఁడు తెల్పకుండు ననుట పొసఁగునే. 361

చ. వన మిది యద్భుతాకృతిని భవ్యతరశ్రుతిగానయుక్తిచే
తను నయనద్వయంబు మది ధన్యములై తనరారఁ జేసెఁ; గా
వున హరి తెల్పఁ దద్గిరికిఁ బోయెడుమార్గ మిదెన్నఁగాదు
నూ, తనమిది తెల్పె లేమి నిటఁ దప్పితి మార్గ మిఁకేమి
చేయనా. 362

ఉ. రాతిరి చాలఁ జెల్లె రఘురాముని తమ్ముఁడు మూర్ఛ మున్గె
నా, చేత ప్రధానమంచును సుషేణుఁడు చెప్పెను రామ
మూర్తి న, న్నీతఁడేఁ బంపె మార్గ మిది యివ్విధిఁ దప్పె
మదీయకార్యమే, యూఁతగ నెంచు కీశపతి యుద్యమ మెవ్వి
ధిగా ఫలించునో. 363

ఉ. వచ్చెడునప్పు సచ్ఛకునవారము గానఁగనయ్యె దాన నే
నిచ్చఁ దలంచినట్టిపని యెంతయు వేగ ఫలించు నంచు లో
ముచ్చట నొందుచుంటి నిదె భూధర మంచుఁ దలంచుచుం
టి ని, ట్లిచ్చటఁ ద్రోవ తప్పుటయె యెన్నఁగనైతి నిఁ కేమి
చేయుదున్. 364

చ. నిలువఁగ వేళగాదు రవి నిల్వక తూరుపుకొండఁ జేరు నా

పలుకులు నిష్ఫలంబు లగుభానుకులాభరణానుజుం డొగిన్
విలయము గాంచు రామపృథివీపతితోడనె పోవుఁ గిశవ
ర్యులు మృతిఁ గాంతు రిట్టు లగునుద్యమ మయ్యది సాగ
కున్నచోన్. 365

క. కనుక నిఁక నాలసింపక
వనమునకుంబోయి మానివర్యుల వేదా
దినిఖిలవిద్యానిధులం
గనుఁగొని యవ్వారి నడిగి క్ష్మాత్ర మిచటికిన్. 366

ఉ. ఎంతటదవ్వనం గలదొ యే నెటుపోవఁగ నౌనొ యిట్టు లీ
చెంతకు నేలవచ్చితినొ చేరఁగలానొ లతాళిఁ గొంచు భూ
కాంతునిచెంత కెప్పటికిఁ గార్య మిఁదెట్లు ఫలించునో య
టం, చింతయు శంకలే కడుగ నిద్ధమునుల్ వచియింతురం
తయున్. 367

చ అని తలపోసి యాహనుమ యంబరమధ్యమునుండి యాత
పో, వనమున కప్పుడే దిగి యభంగురశీలుఁ జరించి వాయు
వుల్, తనతనువుఁ స్పృశింపఁగఁ బథశ్రమ మింత చనంగ
నౌర! యి,వ్వన మిటులొప్పునే దివిజవర్యునినందనముఁ
హసించుచున్. 368

తే. ఇత్తపోవన మింద నాకెలుకపడుట
పూర్వపుణ్యమె నాకార్యముల్ ఫలించు
నిందుఁ గలమానివర్యుని నిద్ధతేజు
నిపుడె దర్శింతుఁ బ్రోవ నాతఁపసి తెలుపు. 369

ఆ. రాముకార్య మిద్ది యేమాడ్కిఁ దలఁచిన
నంత రాయ మొంద దఖిలజగము

లకును మంగళంబులం గూర్చునదిగాన
మునులనోముపంటగ నగుఁగాన. 370

చ. వనమును దీనిఁ జేరఁగనె వర్షము హాయిని జెందఁజేయుచుఁన్
మనమున నెన్ను వాంఛ యిది బాగుగఁ బండు నటంచు దెల్పు
చుఁన్, దనగతి మందమై తగసదాగతి నన్ను స్పృశించె దాని
చే, తనె విజయంబుగల్గుట ఋతం బని నమ్మితి నేఁ ద్రిశుద్ధిగన్.

క. అని నాల్గుదెసలదృష్టుల్
చనునటు చేయంగ నాశ్వసనతనయునకున్
గనఁబడియె సుందరంబుగ
వన మది మునిశక్తిఁ దేటపఱచువిధమునన్. 372

చ. శ్రుతిసుఖమిచ్చుపక్షితతిశుభ్రతమారవముల్, సుమంబులన్
క్షితిఁ దమిఁ బూజచేయువిధిఁ జేష్టలఁ దెల్పు లతాప్రతాన
ముల్, చ్యుతి యనలేనివైభవము చొప్పడ నుండుమహీరు
హావళుల్, సతతము వాయుపుత్త్రునకు సాంద్రశుభంబును
దెల్పె నత్తఱిన్. 373

వ. అంత నప్పవననందనుం డమందతరానందపరవశచిత్తుండై య
త్తపోవనవిభూతిని మెచ్చుకొనుచు, నిశాసమయంబునఁ బులుఁ
గులేలరొదలు చేయు నిది క్రొత్తగదా యనిశంకించుచు, నిట్లుం
డుట మునివరుమహిమంబునఁగదా యని మరల నిశ్చయిం
చుచు, నలుదెసలు గలయం దిలకించి దూరంబునఁ జారుత
రంబుగాఁ జూపట్టు నాశ్రమంబుం బరికించి యచ్చోటికిం
బోఁదగునది మునివరనివాసమైయుండు నని తలంచి యొక్క
నినదంబు వినంబడఁ జెవియొగ్గి వినుచుఁ దనమనంబునందు.

చ. ఇది శ్రవణార్హమై మదికి నేమియొ చెప్పఁగరాని యట్టిదా

ముదమును గూర్చుచుఁ భవసముద్రముదాఁటఁగఁజేయ
నౌకయౌఁ, గద యను నిశ్చయంబు గనంగా నొనరించుచు
నొప్పె; నౌర! యి, ట్టిది వినదయ్యె నేజని నదెంతటిపుణ్యము
చేసినాఁడనో. 375

ఉ. ఎన్నియొసారు లీధరణి నిద్ధతసస్వరలు సామగానముల్
సన్నుతరీతిఁ జేయ వినినాఁడను, ఋగ్యజుఁరాదివేదముల్
పన్నినవేడ్క సుస్వరవిభాసురవైఖరిఁ జెప్ప వింటి; ము
న్నెన్నఁడు నిట్టి దా నినద మేనొగి విన్నది లే దచెప్పటన్.

ఆ. ఇంతరాత్రివేళ నిట్లు వేదధ్వని
సాగ నేమికతమొ సగమురాత్రి
యపుడు వేదపఠన మదికూడ దందురు
గద యిదేటివింత కలిగె నిచట. 377

క. అనవరతవేదపాఠము
మునివరులకు విహిత మేమొ మూర్ఖుఁడనేఁ గా
వున నది యెఱుఁగనొ యేమొ
చనునే శంకింప మునులచర్యల నెపుడున్. 378

క. అవిధిగ మానులచర్యలు
భువినుండునె యేటిశంకపుట్టె నిదిట్టుల్
సువిహిత మిప్పుడె యిమ్మా
నివిభుం గను టనుచు నయ్యనిలసూనుండున్. 379

ఆ. సంశయములఁ బాసి సరగున మునిచెంత
కరుగ నిశ్చయించె; నంత నచట
నాశ్రమాంతరాళమందుఁ జెలంగెను
శుకము లనువదించు శ్రుతిరవంబు. 380

చ. అనిలకుమారుఁ డద్దివిని యారి! శుకంబులు వేదపాఠ మొ
య్యన మునియాజ్ఞ చేయువిధ మారయనయ్యె నిదేటివింత
యో, మునిపతిశక్తి యెట్టిదొకొ మూర్తిధరించిన యాయ
నంతుఁడే, యని మదిఁ దోఁచెడుఁ నిలువ నర్హముకా దిటఁ
గాలమేగెడున్. 381

క. అని తలఁచుచు ముద మందుచుఁ
దనవచ్చినకార్యమెల్లఁ దలఁపునకున్ రాఁ
గ నతఁడు తొందఱపడుచున్
జనియెన్ మునివర్యుఁజూచు సంతస మొప్పన్. 382

చ. ఇనకులవార్ధిశీతరుచి కెన్నశుభం బొనఁగూడుఁగాక యం
చనిలసుతుండు కృత్రిమమహర్షి వసించెడుపర్ణశాలకుం
జని యటనున్నశిష్యులకు సాధువిధిం బ్రణమిల్లి వారిదీ
వన లొగిఁ బొంది వారు పనుపంగ ద్వర లోనికి నేగె
భక్తితోన్. 383

సీ. అరిగి తదంతరమందు భద్రాసన
మునఁ గూరుచుండి దృష్టిని నియతిని
నాసాగ్రమున నిల్పి నైజలక్ష్యంబున
మదిఁ జేర్చి సుంత ప్రమాదపడని
యోగమ్మునం దామహోద్యమ మొప్పారు
నట్లుండె; నంత నాయనిలతనయుఁ
డమ్మునిఁ గన్గొని యబ్బుర మొందుచు
నిలుచున్నయంతలోపలనె యోగ
ఆ. విరతిఁబొందినట్లు విపులనిశ్వాసంబు
లడర మెల్లమెల్ల నావులించి

దృష్టినల్ల దించి తెఱచి బహిర్గత
ముగ నొనర్చుభంగి మునివరుండు. 384

క. కనఁబఱచి నాల్గుదెసలను
గనుఁగొనుచుఁ ముందు నున్న గాలికొమరునిం
గనె నంతలోనఁ బావని
వినయమ్మునఁ జేతు లొగ్గి విశ్వాసమునన్. 385

తే. వందనం బాచరించి యావరముని పరి
సరమున న్నిల్వఁబడి మునిచంద్రుఁ డట్టె
యాదరంబునఁ గూర్చుండు మనుచు సంజ్ఞ
చేసి జలములఁ జల్లుచుఁ జిత్రవిధుల. 386

క. అతిథికిఁ జేయందగిన వి
ధితతిం బొనరించి పల్కెఁ దిన్ననిధ్వనితో
నతిథివరా యెటనుండియొ
జతనమ్మున వచ్చి తిటకు సంతసమయ్యెన్. 387

క. అనునంతలోనఁ బావని
యనియెఁ మునివర్య మారుతాత్మజుఁడఁ నఁ
హనుమంతుఁ డందురే రా
మునిబంటను హరిగణేంద్రముఖ్యసచివుఁడన్. 388

క. చనుచున్నవాఁడ ద్రోణా
ద్రిని జూడఁగఁ ద్రోవఁ దప్పితిఁ మునివర్యా
ననుఁ జూచినంత యెఱుఁగుదు
రనఘులు మీరౌటఁ గార్యమంతయు మదిలోన్. 389

క అనునంతలోన మునియును
గను లల్లనమూసి యోగకలన సమస్త

బును గాంచినట్లు కనఁబడు
ననువున నిట్లనియె నంజనాత్మజ వినుమా. 390

క. సరిలేనిశక్తి దగుకే
సరి నీ కగుఁ దండ్రి నీవు శ్వసనువరమునన్
బరమాద్భుతతేజంబునఁ
బరఁగుచు జనియించితివి ప్రపంచ మెఱుంగన్. 391

క. పరికించినాఁడ యోగ
స్ఫురణజ మగుదివ్యదృష్టి శుభతమమయి యు
ర్వరఁ బరఁగు రామచరితము
మరుత్సుతా! తెల్పువాఁడ మంజులభణితిన్. 392

సీ. దశరథభూజానితనయుఁడు రాముఁడు
భరతుండు తత్సహోదరుఁడు లక్ష్మ
ణుఁడును శత్రుఘ్నుండును దదనుజులు సుమ్ము;
రాముఁడు సూనృతవ్రతము పూని
యున్నతండ్రి యనుజ్ఞనొంది లక్ష్మణుతోడ
సీతతోడను వనసీమఁజేరె
నందు మాయావృత్తి నారాముభార్యను
లంకాధినాథుండు శంకలేక

తే. యపహరించెను; రాముఁ డాయసురుఁ జంప
సాధుసుగ్రీవముఖకపిసహితుఁ డగుచు
జలధిబంధించి వీరరాక్షసులఁ ద్రుంచెఁ
దమ్ములును బుత్త్రులును జావ దశముఖుండు. 393

క. తనయొద్దఁ బూజలందుచు
ననుపమమై మయుఁ డొసంగినట్టిది యగునా

ఘనశక్తి వైచి లక్ష్మణు
నని మూర్ఛిలఁజేసె దాన నారాఘవుఁడున్. 394

తే. దుఃఖమందఁగ జాంబవంతుఁడు సుషేణుఁ
డుత్తరంబున ద్రోణాద్రియుండు దానఁ
గలవు సంజీవకరణి మొదలగులతలు
వానిఁ దెచ్చిన సౌమిత్రి బ్రదుకు ననుచు. 395

క. నినుఁబంచిరి; వారలదా
పనుపున నీవేగుచుండి పథము తొలఁగి యీ
వనమును జేరితి వివేకద
యనిలసుతా! నీదురాక కగుకారణముల్. 396

తే. యోగబలమున మాకు దివ్యోరుదృష్టి
గలిగియుండును దాన లోకప్రవృత్తి
కరతలామలకంబుగఁ గానఁబడును
నీవు వచ్చినకార్యంబు నెఱి నెఱిఁగితి. 397

క. నీవంటియుత్తముం డిల
భావింపఁగ లేఁడటంచుఁ బలుకఁగవలెనే
పావనివి నీవు రాఘవు
భావించెదు దైవ మనుచు భవ్యమనీషన్. 398

తే. త్రోవఁదప్పితి వైన నీత్రోవవచ్చి
నన్నుఁగంటివి క్షణమున నిన్నుఁ ద్రోణ
గిరికిఁ జేర్చెదఁ జింతిల్ల కురుపథశ్ర
మము తొలంగఁగఁ గూర్చుండు మమలధిషణ. 399

క. శ్రమ మేగఁ జనుదు విచ్చటి
కమలాచల మద్ది దూరమందుండియునా

దుమహితశక్తిని జెంతనె
యమరిన యట్లుండు రాఘవానుజువార్తన్. 400

క. విను తెల్పెద మూర్ఛను గాం
చినలక్ష్మణుఁ జూచుచుఁ గ్ విశీర్ణప్రజ్ఞన్
మనుజేంద్రుఁ డున్నవాఁ డిఁక
వనచరు లారాముఁ గనుచుఁ బలుపూనికలన్. 401

క. రక్షించుచున్నవా రిఁక
లక్షణములు గనినబ్రదుకు లక్ష్మణుఁ డని హ
ర్యక్షగణంబులు తిరుగుచు
రక్షఃపతి బాధలేక రాముఁ గొలుచుచున్. 402

ఆ. ఉన్నవారు రాత్రి యున్నది రెండుజా
ములప్రమాణ మింకఁ బలుకఁదగిన
దెదియొ తెల్పుమనిన నింగితజ్ఞుఁడు వాయు
తనయుఁ డిట్టులనియె మునిని గనుచు. 403

చ. మునివర! మీకిలం దెలియఁబోలనివుండునె చూచినట్టులే
ఘనతరయోగదృష్టిఁ గని గారవ మొప్పఁగఁ దెల్పినారలిం
క నొకటివేఁడువాఁడ రఘుకాంతునిచింతను బాప నొప్పఁ
గా, వున నను వేగ పంపఁ జనుఁబోలదు నిల్వఁగ నాకొకిం
తయున్. 404

ఉ. ఇంకను రాఁడదేమొ గిరికేగెనొ లేదొ పథంబుఁ దప్పెనో
సంకటకారులైన దనుజప్రభుసేవకు లడ్డినారలో
బింకముమీఱ నగ్గిరిని వీరులు కాచుచునుంట వింటి నా
శంక తొలంగు టెట్టు లని క్ష్మాపతిచంద్రుఁడు చింతనుం
డఁగన్. 405

ఉ. ఏ నిటనుండఁ బాడియగునే మునిచంద్రమ సాగనంపుమా.
గానను ద్రోవ నాశిషము గాదిలిప్రేమ నొసంగుమా య
నన్, మానివరుండు వల్కె నను మానము వీడుము పావనీ!
శుభం,బౌనరనాథచంద్రునకునాతనితమ్మునకున్ ధ్రువంబుగన్.

ఉ. నాదు తపఃప్రభావమున నగ్గిరివర్యము నిందుఁ జేర్చెదన్
శ్రీదము లైనయోషధివిశేషములం గొని రాముచెంతకున్
నీదుమహత్వ మేర్పడఁగ నెమ్మి జనంగలవాఁడ వీవు రా
మాదులు దిగ్విదిగ్విదితహారి యశస్కులె యాదురో కపీ.

క. విను మొక్కమాట చెప్పెద
ఘనకార్యం బిద్ది దీనిఁ గడునిష్ఠమెయిన్
జను సాధింపఁగ లతలవి
కనఁబడునే లోకదృష్టి కలితులకెల్లన్. 408

ఆ. మంత్రబలము గలదె మారుతీ నీయందు
దానిసాయమున్నఁ గాని కానఁ
బడవు సుమ్ము దేవవరులకు నైనను
దివ్యమహిమము గలభవ్యలతలు. 409

క. త్వరపడి యీచెంతనె యొక
సరోవరం బీడులేక జలజోత్కరభా
సురమై హంసాదియుతిన్
బరఁగుచు నలరారుచుండుఁ బావనతమమై. 410

క. చని యచటి దివ్యజలముల
మునిఁగి పవిత్రాంగుఁడవయి ముమ్మాఱులు శ్ర
ద్ధను నాచమన మొనర్చియొ
చను దెమ్మా దివ్యమంత్రజాలము నీకున్. 411

క. ఉపదేశించెదఁ దన్మం
త్రపఠనమున దివ్యదృష్టి ప్రాపించును జు
మ్ము పవిత్రమనస్కుఁడవై
తపనాత్మజమంత్రి! నీవు ధన్యుఁడ వగుచున్. 412

క. లతలంగొని వేగమె భూ
పతిచెంతకుఁ బోదు వనుచుఁ బలికిన నవ్వా
క్కతి కెంతో యలరి మారుత
సుతుఁ డది యొందుండు నని సుస్మిత మొలయన్. 413

ఆ. ఛాత్రు నొకని బిలిచి శ్వసనపుత్త్రుఁడు వీఁడు
పరమపావనుండు పాత్రుఁడు నగుఁ
గాన నితని కొసఁగఁగాఁ దగుమంత్రమ్ము
లిపుడె కొలను జూపు మీవు శిష్య. 414

క. అనిపంచిన నాశిష్యుం
డనిలాత్మజుఁ దోడుకొనుచు నరిగి యిదియె సు
మ్మనుపమసరస్సు స్నానం
బొనరింపు మటంచుఁ బోయె నుటజము కడకున్. 415

వ. అంత నమ్మరుత్తనయుండు యామత్రయంబు గడచిన రాత్రి సమయంబున మంత్రగ్రహణకుతూహలంబున గృతాచమనుండై యాసరోవరంబునం గ్రుంక సమకట్టె అయ్యది ముకుళితజలరుహపత్త్రసంలగ్నమధుకరంబగుటఁ బానశాలం బురుడించుచు, నిశ్చలసమాహితస్థితిస్థితహంసాన్వితం బగుటఁ దాపసాశ్రమంబు ననుకరించుచు, సచరమీనకర్కటమకరం బగుట జ్యోతిశ్చక్రంబుఁ గేలిసేయుచు, సభంగజలసంకులం బగుట రత్నాకరంబుఁ గ్రిందుసేయుచు, శీతలస్పర్శం బగుట

హిమాచలంబన నొప్పుచుఁ బరమపావనంబై యుండె. పావ
నియు నాజలాశయంబుం జేరి యించుక లోపలికిం జని
యందు మునింగిన నాచెంతఁ బ్రసుప్తంబై హనుమదంగ
స్పర్శచలజ్జలంబుల సందడి మేలుకాంచి యావులించి యొక
మహాగ్రాహం బాకటిపెంపున నామహాత్ము నట్టె కబళింపఁ
బట్టుకొనియె నప్పుడు. 416

చ. మకరము తన్నుఁ బట్టుకొన మారుతపుత్త్రుఁడు దాని తాఁకు
నన్, వికలము లైనయంగముల విహ్వలతం గని చంచలించి
యే, మికత మొయిట్టులౌట యని మేటిమతిం బరికించి చక్కఁగ
గా, మకరము తన్నుఁ బట్టుకొనె మానదు మ్రింగ కటంచు
నెంచుచున్. 417

క. తలఁపునకున్ వచ్చినరఘు
కులదీపకు మదిని నిల్పి కుందుచు నకటా!
జలములగ్రాహము దంతం
బులకుం జిక్కితి ని.కేమి ముందొనరింతున్. 418

క. తలఁచినపనియెల్లను ని
ష్ఫలమయ్యెను దెల్లవాఱుసమయమటంచున్
దలఁపంగనయ్యె లక్ష్మణుఁ
డిల నిఁక బ్రదుకం డతండె మృతుఁడే యైనన్. 419

చ. సురగణసన్నుతుం డగుచు శోభిలు రాముఁడు నంత మొందు
నా, హరిపతి వెంటనే మరణమందు విభీషణుఁ డంత నీల్గు
సం, గర మిఁకఁ జాలునంచుఁ గపికాంతులు నీరధిలోన ము
న్గి చ, త్తురు మకరంబుచే నిట మృతుండనె యాదును లంక
సీతయున్. 420

క. గతవార్తలు చెవిసోఁకఁగ
మృతినందును నే నొకండ నిట మృతి గనిన
గృతియెల్లఁ జెడును రామ
క్షితిపతి కార్యం బిదిట్లు చెడిపోవుఁగదా. 421

క. అని యిట్లు హనుమ పావన
మనమునఁ జింతించుచుండ మకరియు తుత్తుం
గనియున్నది కావున నా
తని మ్రింగంజొచ్చె భూరిదర్పము పొంగన్. 422

చ. మనమున నవ్విధం బెఱిఁగి మారుతి యింక శమంబు
పూన ఁరాఁ, దని తగ నిశ్చయించి బలమారఁగ వాలముఁ జుట్టి
దానినే, ర్పన వెషలంగ లాగియును బూనిక యించుకయున్
ఫలింపనిన్, గని యిఁక నేది చేయఁదగు కార్య మటంచుఁ
దలంచునంతలోన్. 423

చ. ఉరవడి గ్రాహ మాహనుమ నుద్ధతిమీఱఁగ బట్టి శక్తి వి
స్ఫురణముమీఱ మ్రింగఁగను బూనె; మరుత్సుతుఁ డూహ
సెంపునన్, హరిపతి హస్తిఁబట్టునటు లామకరిన్ వడిఁ దోఁకఁ
జుట్టి సు, స్థిరబల మాని యీడ్చె నది చేద్పడకుండెను నైజ
శక్తిచేన్. 424

చ. తనదగుయత్నమెల్లఁ జెడఁ దామది నెంచె మదీయసత్త్వమె
ల్ల నిచటవ్యర్థమయ్యె; నిదిలాఘువమొప్పఁగనన్ను మ్రింగఁజొ
చ్చెను రఘురాముకార్య మిది సిద్ధినిబొందెడునట్లు లేదు నా
తనువిట నీమహామకరదారుణనక్రబిలంబు చొచ్చెడున్.

ఉ. ఐనను మాన కేనొకప్రయత్నముచేసెద నంచు నమ్మరు
త్సూను.డు నుంత నెమ్మదిని సూనృతశీలుని రామచంద్రునిన్

దీనశరణ్యు నెంచి తనదివ్యశరీరము హ్రస్వమై తగం
గా నొనరించి యమ్మకరగాఢముఖాంతరమందు మెల్లఁగన్.

ఆ. చొచ్చె ; నంత నదియు నిచ్చమెయిన్ మ్రింగి
తుత్తువానె ననుచుఁ గుతుక మలర
నావులించి దప్పిపోవఁగ నీరాను
వేడ్కఁ నోరు తెఱచువిధి నెఱింగి. 427

చ. అరుదుగ మేనుపెంచి విలయాంతకుపోలికఁ బ్రజ్వరిల్ల ని
ర్భరగతిఁ దచ్ఛరీరమును గ్రన్ననఁ జీలిచికొంచుఁ బైకి రా
సరసున నెల్లెడం బెరసె సాధ్వసముం గలుగంగఁ జేయువై
ఖరిని దదీయదేహమునఁ గన్పడు ప్రేవుల తున్కఁ లంతటన్.

క. మకరిశరీరమునుండియె
యకలంకాకృతి తగంగ నచ్చర యట వే
డుకమై నంబరతలమునఁ
బ్రకటవిమానంబునందు భాసిలి పలికెన్. 429

క. హనుమంతా ! గుణవంతా
వినవయ్యా ! నీదుకృపను వికృతాకారం
బును బాసి స్వస్వరూపం
బును గాంచితి శుభముగలుగుఁబో నీ కింకన్. 430

ఆ. ధాన్యమాలిని యనుదాన నప్సరసను
శాపకారణమున సరసునందు
నిందు గ్రాహరూప మెత్తితి నేఁటికి
శాపమోక్షణంబు సంభవించె. 431

ఉ. నీదయ నాస్వరూపమును నేఁగనఁజాలితి నింకఁ బోయెదన్
మీఁద జెలంగుస్వర్గపురి మించుసురేశ్వరు కొల్వులోనికిన్ ;

గాదిలిప్రేమ నీకు నుపకారము చేయఁగఁజాల నైన నిం
కేదియుఁగాదు రాముకృతి కింతసహాయముచేయఁబూనితిన్.

క. దేనఁ నీదు ప్రమాదము
మానునొ యాపలుకు నీకు మారుతతనయా
నేను వచించెద వినుమా
మానక నామాటరీతి మైకొనుచేయన్. 433.

ఉ. ఈతఁడు కాలనేమి యన నెన్నికగన్ననిశాచరుండు వి
ఖ్యాతమునీంద్ర వేషమునఁగాలమువుచ్చుచునిన్నునిల్పియా
భూతలనాథుసోదరుని పోకడఁగోరుచు నున్నవాఁడు దు
ర్జాతుఁడు రావణాసురునిశాసనముఁ నెఱవేర్పువాఁడు సూ.

చ. నిను నిట నిల్పి యాకృతకనీరముఁ ద్రావఁగఁ జేసి యంతముం
గనఁగొనరించి రావణుని కార్యములఁ ఫలియింపఁ జేయఁగా
మనమున నెంచు నీదురభిమానుని నీచుని దుష్టచిత్తునో
యనిలతనూజ! చంపి చనవయ్య మఱొండు తలంప కద్రికిన్.

చ. సరసున నిందు గ్రాహము నిశాతభయంకరభూరిదంష్ట్రలం
ద్వరమృతినందఁజేయు నెటువంటిపరాక్రమశాలినైన నం
చురుతరరీతి నొప్పు నుడియూహకు రా నితఁ డిందు మౌనినై
వరనియమంబుఁ బూనెదశవక్త్రుఁడు పంపఁగనిన్నుఁజంపఁగన్.

చ. పరిసరమందె యున్నయది భవ్యసరోవర మంచు నిన్ను స
త్వరగతిఁ బంపి నీవిచటివారి మునుంగఁగఁ జత్తు వంచు నా
దరము మెయిఁజపించుచునిశాంతదురాగ్రహచిత్తుఁడౌచునా
శరుఁ డిటనున్నవాఁడు మది జంకక వేపొలియింపు మాతనిన్.

ఆ. ఈతపోవనం బదెన్నఁ గృత్రిమ మగు
విషఫలంబు లిందు వెలయుచుండు

ఫీనిఁదినిన యపుడె వెడలును బ్రాణముల్
బ్రదికితీవు రామభద్రుకరుణ. 438

క. సలిలంబు లతనిచెంగటఁ
గల వవి విషపూరితములు గాఁ దలఁపుము భూ
తలమున నిట్టి దురాత్ముఁడు
తలపోసిన లేఁడు కానఁ దవ్వరఁ జంపఁదగున్. 439

క. ఎన్నెన్ని మాయలైనం
బన్నును నిను మోసగింపఁ బవనాత్మజ నీ
వన్నిట నిశ్చలమతివై
క్రన్నన నీకాలనేమిఁ గడ తేర్పు మిఁకన్. 440

క. విను మొక్కమాటఁ జెప్పెద
ననిలసుతా! మోస మిద్దియంతయుఁ గానన్
ముని చెప్పెడు మాటలకున్
మనసొగ్గక ముష్టిహతుల మ్రందింపు మొగిన్. 441

క. వచియింపఁదగినదంతయు
వచియించితి నీదుకరుణవచ్చెన్ మరలన్
బ్రచురతరనైజరూపం
బిచటన్ నిలువంగనోప నేఁగెద దివికిన్. 442

చ. అన విని నెమ్మనంబునఁ బ్రహర్ష వికారము లెల్లఁ దోఁప ని
ట్లనియెను న్యాయరీతి వినవమ్మ మదుక్తిని జారుగాత్రి! నీ
వనుపున నేమెలంగెదను బాపిని వీని వధింతుఁగాని నే
వినవలతున్ భవచ్చరితవిస్మయతం గనఁజేసె నామదిన్. 443

ఆ. ఏమికారణమున నీకీమహాదుష్ట
మకరరూప మొదవె మనసుతృప్తి

నొంద నెఱుఁగఁజెప్పు మోధాన్యమాలినీ
యనిన నాదరమున ననియె నెలఁత. 444

## ధాన్యమాలినీ చరిత్రము.

సీ. వినవయ్య పావనీ! వృత్తాంత మిద్ది నా
యది యద్భుతావహంబై చెలంగు
నప్సరోగణమున యందు నే నొకతుక
విఖ్యాతచారిత్ర విమలరూప
శీలనుగానుండి శివుని మహాదేవు
దేవతాధిపపూజ్యదివ్యచరణ
పంకజు వేదాంతవర్ణితరూపుని
సర్వేశ్వరుని హరు శంకరు గణ
తే. నాయకునితండ్రి మెప్పింప నామనంబు
గోరె నొక్కట నంతటఁ గూట గణవి
రాజితం బగుమేరుభూధ్రంబుఁ జేరి
విమలనియతిని జపముఁ గావించుచుండ. 445
చ. పరశివుఁ డంత నొక్కట శుభప్రదకాలమునందు మ్రోల
సుందరతరవేష మొప్ప గిరితల్లజపుత్త్రిక యర్ధదేహమం
దు రమణనుండ శీర్షమునఁ దోయజవైరి సురేఖ గ్రాలఁగా
నిరుపమచిత్ప్రకాశుఁ డతినిర్మలచిత్తుఁడు నిల్చె నంతటన్.
చ. తనువు చలించుచుండఁ బరతత్వము శంకరుఁ గాంచి నేను భ
క్తినియతి లేచి నిల్చి గురుదీప్తతదంఘ్రిసరోజముల్ శిరం
బున స్పృశియించి శక్తికిని బోలినయట్లు నుతించి యంతికం
బునఁ గయిమోడ్పునన్ నిలువ భూతవిభుం డనుకంపమీఱ
ఁగన్. 447

మ. అతివా! నీదగువాంఛ యేదొ తపమిట్లత్యంతనిష్ఠన్ బొన
ర్చితి సంప్రీతుఁడనైతి నేవరము నీచిత్తంబునం గోరువాం
ఛ తగం బొల్చునొ తెల్పుమా యొసఁగుదున్ జార్వంగి
వయ్యున్ మహా, మతిమంతుల్ పొనరించునట్లు శ్రమనే
మాత్రంబు లెక్కింపకే. 448

తే. తపముచేసితి విదె చాలు ధన్య వీవు
తెల్పుమా వాంఛితం బని తేటపడఁగఁ
బలుక శంకరువాక్కుల కలరి మరల
వందనం బొనరించి యాభవునిఁ గనుచు. 449

శా. ఎందేఁ బోవఁగఁ గోర్కిగల్గిన జవం బేపార నప్డే చనన్
డెందం బెంచెడుఁ గాన వ్యోమచరమై నిర్బాధకంబై మహా
నందంబుం గలిగించుయానవరమున్ నాకిమ్ము లోకేశ! స
ద్బృందానందకరా! యటన్న నగి యావిశ్వేశ్వరుం డిట్లనెన్.

ఉ. అచ్చరమిన్న నీదయినయాశయమెంతయుమెచ్చుఁగూర్చె నీ
యిచ్చకువచ్చినట్లు త్వర నేగువిమానము నిచ్చినాఁడ నీ
వెచ్చట నేముహూర్తమున నేర్పడఁగాఁ దలపోయుదో జవం
బచ్చుపడంగ నచ్చటికి నవ్వరయానము వచ్చి నిల్చుఁ జూ.

ఆ. దానినెక్కి నీవు తలఁచినచోటికి
నరుగుచుండు మనుచు నాజ్ఞచేసి
హరుఁడు చనియె; నంత నాత్మఁ దలంచితి
యాన మిపుడె రాఁగ నగు నటంచు. 452

ఉ. ఏమనిచెప్పుదానను గపీశ్వర! యోహనుమంత యప్పుడే
వ్యోమచరం బపూర్వమననొప్పెడుయానము వచ్చి నిల్చెనం
దే మది మోదమందునటు లేనుసఖీయుతిఁ గూరుచుంటి నీ

భూమినిగల్గు ప్రోదినులు భూధరముల్ సరసుల్ తటా
కముల్. 453

క. తలఁచినమాత్రన గన్పడు
నిలిచిన యట్లుండుఁగాని నేను నిమేషం
బులు రెండుమూఁడు నాల్గని
పలికెదు నాలోనఁబోవుఁ బల్కఁ లిఁకేలా. 454

తే. ఇట్లు తిరుగుచు నొక్కనాఁ డేను బూర్వ
పాపఫలమును బొందంగవలయు తఱిని
గంధమాదనపర్వతకాననమునఁ
దిరుగవచ్చితి నిఁక నేమి తెలుపుదాన. 455

క. మనమును గరఁగించుచు నా
ర్తిని ముంచెడు నాదుచరితఁ దెల్పెద వినుమో
యనిలసుతా! యాగిరిచెం
తను మోదమునం జరించుతరుణమునందున్. 456

క. అనఘుఁడు శాండిల్యుం డను
మునిపతి యొక్కండు నాదుమోమును గని యిం
తనిచెప్ప నసర్హంబగు
మనసిజపరితాపమంది మఱిమఱి కనుచున్. 457

తే. చెంతకేతేర నేను నుచితవిధులను
బూజ లొనరించి సుకృతంబు పొదలఁ బావ
నమగు మీదర్శనంబయ్యె నాదుజన్మ
మిదె ఫలించెను మానిగణేంద్ర యనుచు. 458

క. నానోములుపండుట నీ
కాననమున మిమ్ముఁ జూడఁగంటి ననుచు మో

దానూనభాషణంబుల
మానీశుని నలరఁజేయ మ్మానురుఁ డంతన్. 459

చ. తనజతనంబుపండె నని తద్దయు నమ్మి తనూరుహంబు లో
య్యన నిలువంబడంగ మది నగ్గలమై తమిపొంగఁగా వచిం
చెను జతనంబు నూని యిటు చేడియరో నినుఁగాంచి నంత
న్నామనము స్మరేషులక్ష్యమయి మానుపరానివ్యథం దపిం
చెడున్. 460

చ. పలుకులు వేయు నేల? సురభామిని నీదుకటాక్షమే తపః
ఫలమని, విప్రజన్మ మిది ప్రాగ్జనిపుణ్యఫలంబు పండఁగాఁ
గలిగిన దాట దానికిని గమ్యఫలం బని యెంచువాఁడ నీ
సులలితదర్శనం బె విధిచోదితమోక్షఫలంబుగా మదిన్. 461

చ. తలఁచుచు నున్న వాఁడనుల తావ్మృదులాంగిరో నేవచించు ని
ప్పలుకులు సత్యపూతములుభావము నీపయిఁ బర్వెనాకుఁ జి
క్కులఁబడకుండఁ గౌఁగిటను గూర్పుము చేర్పుము సౌఖ్య
రాశి నేఁ,గలవిలపాటునొందనటుగా దయఁజేయుము పుణ్య
మబ్బెడున్. 462

మ. చిరకాలం బుపవాసముల్ సలిపి సంసిద్ధప్రభావాఢ్యులౌ
గురువుల్ చెప్పినమాటలెల్ల శ్రుతివాక్కుల్ గాఁగ నాలించి
యా,దరమొప్పంగఁదదుక్తమార్గమునవిత్యంబుం బ్రవర్తించు
నట్,దరుణీ! నీదుకటాక్షపాత్రునిగనెన్నంబోలు నిక్కంబుగన్.

తే. నీదుకౌఁగిలియే ముక్తినిధి యటంచు
నిశ్చయించితి నిట్టిమునిం ద్యజింప
న్యాయమే నాతపస్సున కరయ నిన్నుఁ
గూడుటయె ఫలమంచెదఁ గోరువాఁడ. 464

ఆ. స్వర్గమార్గ మిదియె సర్వతపఃఫల
సార మిదియె పూర్వజన్మపుణ్య
కర్మఫల మనంగఁ గ్రాలెడునది యిదె
నీదుపొందుసుమ్ము నీరజాక్షి. 465

క. వినుమా నామాటను ని
న్ననుదినమును గొల్చువాఁడ నన్నిఁట నిన్నే
గనుచుండువాఁడ మిక్కిలి
గనుబ్రోవుమ యిదియె మ్రొక్క గైకొనఁగఁదగున్. 466

క. అని మఱిమఱి ప్రార్థించెడు
మునికాంతను దీర్చ నెంచి మోమున స్మితమొ
య్యన నాట్యమాడఁ బల్కెతి;
వినవయ్యా తాపసేంద్ర విషమశరార్తా. 467

క. ననుఁ గామించితి కావున
నినుఁ గౌఁగిటఁజేర్చ నేను నెమ్మిఁదలఁచితిఁ
విను మొక్కమాట నిపు డశు
చిని గావున ముట్ట నీకుఁ జెల్లదు సుమ్మీ. 468

క. తరుణులకు రజోదర్శన
మరయంగా మాసమందు నగుచుండుఁగదా
త్వరపడ కిమ్మాఁడుదినము
లరుగఁ ననుఁబొందు మిష్టమంతయుఁ దీఱన్. 469

క. రేపును మఱుదినమేగిన
నోపావనచిత్త! శుచితయొప్పును నాయం
దేపాఱ నపుడు సురత
వ్యాపారము సాగవచ్చు నని పల్కుటయున్. 470

చ. మునిపతి యిట్లుపల్కి మదిఁబొంగెడు మోదరసంబు నిల్పఁ
జా, లని తడఁబాటుపల్కుల; విలాసవతీ! ననుఁగూడి గంధ
మా, దనమున నాకుటీరమునఁ దత్పమయం బొనఁగూడుదాఁ
కని,ల్చినియతినన్నుఁగూడుమనఁజిత్తమురీతిమెలంగుదానఁజా.

క. అనిపలికి యత్తపోనిధి
ననురాగముమీఱఁ గూడి యరిగి మహీధ్రం
బునఁ బొల్చుపర్ణశాలను
గని నియతి దగంగనుంటి గంధవహసుతా. 472

క. తొలిదిన మెల్లను గడచెను
బలలాశనపతియుఁ గీర్తి భాసిల లోకం
బుల గెల్చిన వీరుఁడు ముని
కులతాపకరుండు మిగులఁ గ్రూరుండును నై. 473

తే. రావణుం డనుపేరఁ బరఁగుచు మాఱు
లేక లోకంబులెల్లఁ జీకాకుపడఁగఁ
దిరుగుచున్ యుద్ధమును నెమ్మదిని సతంబు
కోరు నప్పంక్తికంఠుఁ డుదారబలుఁడు. 474

చ. పరిచరవారముల్ భటులు వైరివినాశనకార్యదక్షులై
పరఁగుచమూపతుల్ గొలువభవ్యవిమానము నెక్కివచ్చియా
ధరణిధరంబునన్ విడిసె; దానవురాక నెఱుంగ కేను రా
తిరిసమయంబునం జెలఁగి దివ్యగళస్వనమొప్పునట్లుగన్. 475

ఉ. చారువిపంచికారవము సంగతిఁ బాడితి, గాన మద్ది యా
ఘోరనిశాచరేంద్రుశ్రుతి గోచరమయ్యె; సతండు లేచి ది
గ్వారము గాంచి నిస్వనము వచ్చెడుచోటికివచ్చి యందునన్
జేరి విలాస ముట్టిపడఁ జేయఁగ నిట్లనియెం గపీశ్వరా. 476

ఉ. ఎందు వసించుదానవొ యదెవ్వరిపుత్రికవో విభుండు నీ
కుం దగ నెవ్వఁడో, యిచటఁ గూర్మి వసింపఁగ హేతు వే
మొకో, సుందరి, తెల్పు పుణ్యమునఁ జూడఁగ నోచితి నిన్ని
టన్ మహా, నందముఁబొందె డెంద మిఁక నాథునిగా గ్రహి
యింపు నన్ గృపన్. 477

మ. కనిచాఁడన్ సురలోకభామినుల యక్షస్త్రీలఁ గన్గొంటి నిం
కను లోకంబులఁ గల్గుసుందరుల నిక్కం జేను గన్గొంటి నెం
దును నిన్ బోలిన సుందరాంగిని నదెందుంజూడలే దింతిరో
ననుఁ గైకొ మ్మిఁకఁ బ్రాణనాథునిగ దానన్ జన్మలాభంబుగన్.

మ. ధనముల్ రత్నము లింకనుంగలపదార్థంబుల్ భవత్కాంతికిం
తం, బునకున్ వచ్చిన వేవియేఁగొనఁదలంపుం బూనినం జక్క
ని, చ్చి నినుం గొల్చెద నీదుమన్ననల నాచిత్తంబుపొంగంగఁ
జే, సి నితాంతంబు సుఖింపఁజేయు మనుచుం జేమోడ్పుసం
ధిల్లఁగన్. 479

క. ననువేఁడె; నంత నే నా
దనుజేంద్రుఁడు దుష్టుఁడగుటఁ దలపోసి మనం
బున కెక్కమాట లాడం
గను బూని వచించితి నిటు కమ్రభణితులన్. 480

క. దనుజేంద్రా! యుత్తరమున్
వినుచెప్పెదఁ బ్రశ్నములకు వివృతంబుగ నే
నును దేవకన్య యనుదా
నను నిర్జరలోకమెన్న నాకు వసతియగా. 481

తే. అప్సరఃకులసంజాత నమరవంద్యు
నీశ్వరుని దేవతాధిపు నెంతొ భక్తి

నలరఁగాఁజేసి యీవ్యోమయానవరముఁ
బడసి తిరుగుచునుందును వలసినట్లు. 482

ఆ. ధాన్యమాలిని యని దానవాధిప! పిల్వఁ
బడుదు నేను నిన్ను వనమునందు
సంచరించుచుండ శాండిల్యముని నన్నుఁ
గోరి వేఁడె నొప్పుకొంటి నేను. 483

ఉ. ఆముని వేఁడికోలుగొని యాదృతిమీఱఁగవచ్చి యీగిరిం
ద్రామలదివ్యసానువుల నచ్చెరువందుచు గాంచుదాననే
నోమహనీయవంశభవ యుగ్రపరాక్రమ! దానవేశ్వరా!
నీమది మానిభర్తృకను నేనని యెన్నఁదగుంద్రిశుద్ధిగన్.

క. ఇంతియగాక రజస్వలఁ
బంతం బిది మానవలయుఁ బలలాశన! యీ
చింతను మానుము పరవశ
కాంతను గోరంగరాదు గా యెప్పుడైనన్. 485

క. అని వేఁడితి హనుమంతా
దనుజుం డామాటల విని తత్తఱపడుచున్
నను నడ్డగించి యీవిధి
ననియె లతాంగీ! త్వదీయ హారివచనముల్. 486

క. వినినంత సంతసంబెద
జనియించె రజస్వలయగుచాన పరునియం
గనయెట్టు లగునో తెలియక
మనమునఁ జింతించువాఁడ మాట లికేలా. 487

చ. నినుఁ గనినంతనుండియును నీరజనేత్ర! ప్రసూనసాయకుం
డనుపమశక్తి నామది మహత్తరపీడ నెసంగఁజేసె నే

మని వచియించువాఁడ విజయాహవమందునుభీతినొందఁగా
ని నిముసమైన ధైర్యమున నిల్వఁగఁజాల నదేమి వింతయో.

ఉ. చిక్కులఁబెట్టఁ బోకు మిఁకఁ జేడియరో! తమిదీఱఁ గౌఁగి
టం, జిక్కఁగఁ బట్టి సౌఖ్యమును జెందఁగఁజేయు మటంచుఁ
బల్కిన, న్నక్కనఁజేర్చిబల్ రతుల నానిశియెల్ల సుఖంచెఁనప్పు
డే, యొక్కసుతుండు గల్గె మహిమోగ్రుఁడు దానవలకు
శాధ్యుఁడున్. 489

చ. తనయునిఁ గాంచి నేనుఁ బ్రమదంబును బొందక వీని నీవె
కై, కొనుమని యొప్పగింప మదిఁగూరినప్రీతిని వానిఁ గొం
చు నా, దనుజవిభుండుపోయె; మునితల్లజుఁ డేమనునో య
టన్న భీతిని మఱు రేయినిం గడపి దివ్యనదిౘ విధిఁ గ్రుంకి
యంతటన్. 490

క. పరిశుద్ధచిత్తునై ముని
వరు చెంగటి కేగి నిల్వఁ బావనయోగ
స్ఫురణమున నొప్పుదృష్టిఁ
జరగినవృత్తాంత మెఱిఁగి సక్రోధుండై. 491

క. కనులుగ్రములై యెఱ్ఱగఁ
గనఁబడఁగాఁ దీక్ష్ణదంతఘట్టనముల మో
మునఁ గ్రోధ ముట్టిపడుచుం
డ నసుం గని యిట్టు లనియె నారీ! యిచటన్. 492

తే. నాగృహంబున వసియించి నన్ను మోస
పుచ్చి యితరుని బొందితి వచ్చరలకు
నిద్ది వృత్తియొ? న్యాయమే యిదియు నీకు
భామ లన మోస గత్తియల్ పలుకు లేల. 493

సీ. సత్యమార్గమునకుఁ జానకు బల్దూర
మనుమాటయె యథార్థ మంబుజాక్షి.
సత్ప్రవృత్తికిని స్త్రీజనికిని బల్దూర
మనుమాటయె యథార్థ మంబుజాక్షి.
నియమంబునకుఁ గన నెలఁతకు బల్దూర
మనుమాటయె యథార్థ మంబుజాక్షి.
నిశ్చంచలతకు వనితకును బల్దూర
మనుమాటయె యథార్థ మంబుజాక్షి.
తే. నమ్మఁగారాదు వనితల నమ్మరాదు
నమ్మినంతనె చెడువాఁడు సుమ్ము ధాన్య
మాలినీ! నాగృహంబును మమతఁజేరి
నన్ను వంచించితివిగదే వన్నెలాడి. 494

క. తెలియంగలేకపోతిని
లలనా! నీమాయమాటలను సత్యంబుగ
బలికితి వని నెఱనమ్మితి
దులువతనం బిట్లు చూపఁ దోసఁగు పోసఁగదే. 495

క. మునినయ్యును నినుఁగోరితి
ననునిట్టిప్ర భావమహితు న్యాయపథమునం
జనువానిని వంచించితి
దనుజునిగూడితివి నీకు ధర్మమె చెపుమా. 496

క. తలపోయవలదె సుంతయుఁ
జెలియా! సత్యంబుపల్కి చేయక యున్నన్
గలుగును నిరయం బని నీ
పలుకులఫల మిప్డు తెలిసె బాగుగ నాకున్. 497

క. నన్నే యిటువంచించితి
వెన్నఁగ సామాన్యజనుల నిఁక నీ వెట్టుల్
మన్ననలం దేల్తువో నే
నెన్నంగను జాల నింత యేఁ దరళాక్షీ.　　498

క. స్నానం బగుడు మునీంద్రా
సూనాంబకు బారిఁ బడనిచో ప్పున రతులన్
నే నిన్నుఁ దేల్తు నని ప్రియ
మూని వచించితివిగాదె పొలఁతీ! వనిలోన్.　　499

క. ఏమేమొ నీతులను నా
డా మది తృప్తిం గనంగ నచటఁ జదివి యి
ట్లీమనుజాళను బొందితి
వేమనఁగల దింకఁ జెడియె నీప్సితమెల్లన్.　　500

క. తులువతనం బంగనలకుఁ
గలుగుట సహజం బటంచుఁ గడునమ్మక నీ
పలుకుల నమ్మితి మోసము
తెలియఁగ లేనైతి నిట్లు తెఱవా! చెడితిన్.　　501

క. ఐనన్ మించినకార్యము
మానక తలపోయ నేల? మానిని! నీదు
ర్మానము దూలఁగ శాపం
బేనిత్తు గ్రహింపు నీరజేక్షణ యింకన్.　　502

మ. నను వంచించి పరున్ గ్రహించితివి కానన్ నీవు గ్రాహాకృ
తిన్, గని యీభూరిసరస్సునందు నిలువంగాఁ జెల్లు నీలోననే
జనుఁడై నన్ నినుఁగూడి నంతటనె భస్మప్రాయగాత్రుండు నౌ
వనితా! యేగు మటంచు భూరితరకోపప్రస్ఫురద్వహ్నియై.

చ. పలికినయంతనే పిడుగుపాటును బోలినమౌనిశాపముం
దెలిసికొనంగఁజాలని మతిభ్రమణంబునుబొంది యంతలోఁ
జెలియలు చక్కఁగాఁ దెలియఁజెప్పిన నేమనిపల్కుదాన ను
జ్జ్వలపరితాపవహ్నిపయిఁ బ్రాఁకినయట్లయి నన్ను నేఁచఁగన్.

తే. ఒడలు తెలియక కొంతసే పుండి పిదప
శాపవిధ మంతయును మదిఁ జక్క నెఱిఁగి
పావనీ! యేమిచెప్పుదుఁ బరమమౌని
పాదములపైనిబడి యేడ్చుపలుకు లొప్ప. 505

చ. మునివర! తప్పొకింతయును బుద్ధి నెఱింగి యొనర్పలేదు భీ
తినిగలిగించుదానవుఁడు దేవవిభుం బెదరించువాఁడు గా
వున నను బల్మిఁబట్టుకొనె బుద్ధివిశేషము గల్గినంత చె
ప్పిన వినఁడయ్యె నేమనుదు విస్మృతనీతి యతండు క్రూరుఁడౌ.

ఆ. యోగదృష్టి నెఱుఁగ నోపుదు వట్లౌట
నెవరితప్పొ తెలిసి యట్టిశాప
మిడఁగఁ దగునొ తగదొ హితమని నెంచుఁడీ
యనుచు విన్నవించి యార్త నగుచు. 507

క. పలుకులు తడఁబడ నేడ్చుచుఁ
జెలువముచెడ నంజనంబు చెదఱఁ దనదుప
జ్జలజములఁ గాంచు నన్నా
సులలితగుణ! మౌనివరుఁడు చూచి సదయుఁడై. 508

క. వనితా! తప్పునకుం సరి
యనఁదగుఫల మొంది తిప్పు డస్మచ్ఛాపం
బును మరలింప నశక్యం
బని మఱియుం బల్కె దేవతాంగన! వినుమా. 509

సీ. చిరకాల మీవిట సరసున గ్రాహరూ
పంబున నుండంగఁ బవనతనయుఁ
డైన హరీశ్వరుఁ డరుదెంచి నీచేతఁ
బట్టుకొనంబడ బలము మెఱయ
నినుఁ జంపు శ్రీరామనృపతి కార్యార్థమై
వచ్చిన యాకపివరుఁడె నీకు
శాపమోక్షంబుఁ బ్రసాదించు నవ్వేలఁ
దొంటివిధంబునఁ దోఁచినట్లు
ఆ. సంచరింపఁగలవు సంతాప మందకు
మనుభవింపకున్న నస్మదీయ
శాపమేగదనుచుఁ జనుమంచుఁ బంపెను
బవనతనయ పెక్కుపలుకు లేల. 510



క. మునిశాపహావ్యవహాఽర
శ్మిని గ్రాఁగి దురంతతాపశిఖిఁబడి నేనుఁ
వనితలఁ బరిచరులను నా
జనస్థానంబుఁ జేరఁ జనుఁ డిఁక ననుచున్. 511

ఆ. సాగ నంపి దుఃఖసాగరంబునఁ బడఁ
దలఁచుచుండ మౌని యలఘుశాప
మావరించె, నంత నతిదారుణగ్రాహ
తనువుగల్గె నాకు ననిలతనయ. 512

క. దానివిధం బెల్లను నీ
వీనెలవునఁ జూచినాఁడవేకద యింకన్
నానెలవునకుం బోయెదఁ
గాని నిశాచరుని వీనిఁ గడతేర్పు మిఁకన్. 513

క. మాయల నెన్నింటినో యిట
నీయసురుఁడు పన్నువాని నెన్నక వీనిఁ
మాయింపుము రాముని కా
ర్యాయత్తుఁడ వౌట వేగ యరుగుము గిరికిన్. 514

సీ. మార్గ మీయదియే క్షమాధర మిచటికి
శతయోజనములంత తూలిని గలదు
వేవేగ పొమ్మని వినువీథి నాథాన్య
మాలిని దివ్యవిమాన మెక్కి
చనియె నాతెఱఁగెల్ల హనుమ విస్మయమునఁ
జింతించి యిదియేమి వింత యనుచుఁ
దలఁచుచుఁ గ్రోధంబు తనువొందినట్లుగాఁ
గానఁబడుచుఁ ద్వరఁ గాలనేమి

ఆ. యున్నవనికిఁబోయె నన్నరాశనుఁ డటఁ
గనులుమూసి నియమకలితునట్టు
లక్షమాలచేత నలర మెల్లఁగ దానిఁ
ద్రిప్పుచును మనంబు తీవ్రభక్తి. 515

క. పరమేశునందుఁ దగులఁగ
నిరతము యోగంబునందు నెమ్మిగలిగిన
ట్లరయఁగఁ దెలియంబడుచున్
స్థిరతత్త్వముఁ గాంచునట్టి చిహ్నము లలరన్. 516

ఆ. కొలఁదిగడియ లట్లు లలితయోగంబును
బూని యుండి యంత బుసలు నిగుడ
లేచు త్రాఁచుభంగి నాచిత్రమునివర
వేషధారి యట్టె విషమదృష్టి. 517

క. మెలమెల్లఁగ బెంచుచు నూ
ర్పులఁ బుచ్చుచు నపుడె లోకబుద్ధిని దాల్పం
దలఁచునటు నాల్గుదెసలం
గలయంగాఁ జూచెఁ గపటగతి మఱుఁగుపడన్. 518

చ. కనుఁగొనుచుండునంతఁగపికాంతుఁడుపావనిదృష్టిఁదోఁచినం
తనె యొకయద్భుతంబును గనంగఁదటాలునవిస్మయంబుగాం
చినయటులేమి వాయుసుత శీఘ్రమె రమ్మని పంపితింగదా
పనిచిన యట్లు చేయ కిటు బాలిశురీతిఁ జరించినాఁడవే.

ఆ. రాత్రి చాల గడచె రయమున రాదగు
చొప్పుమఱచి యిట్టు లిప్పు డోనరు
పంగఁదగునె చెంతఁ బద్మాకరంబున్న
దచట నింతకాల మూగఁ దగునె. 520

క. పని యెంతటిభారం బని
యును దలఁపవు ద్రోణగిరికి నురువేగమునం
జనవలసియుండు గాదే
వనచరులందఱును రామభద్రుఁడు నచటన్. 521

క. నీరాక వేచియుందురు
సారమతీ యింకనైన సమయజ్ఞుఁడవై
చేరంజను ద్రోణాద్రిని
రారమ్మా నీకు మంత్రరత్న మొసఁగుదున్. 522

క. స్నానం బొనరించితివే
యానీరములందు భక్తి యలరంగ మరు
త్సూనుండ వీవు చయ్యనఁ
బొనర్పుఁడ వైనమంత్రమును గైకొనినన్. 523

క. చనుదువు క్షణమాత్రంబున
వినుమొక్కటి కోలఁకునందు విస్మయమును బు
ట్టను జేయునీరముల డ
ప్పిని బాపం ద్రాగితివె సువిస్తృతతేజా. 524

క. అనుపమసలిలములవి పా
వనములు నీదప్పి నెల్లఁ బాపందగు నిం
కనుగోరె దేమొ తెల్పుము
పనిఁదీర్చి పంపువాఁడఁ బావని నిన్నున్. 525

క. అనిపలికి తనకు నుత్తర
మును జెప్పక యూరకున్న మోస మెఱిఁగెనో
యనుసంశయంబు తోఁచిన
దనుజుఁడు స్మితభాషణములఁ దా నిటు పలికెన్. 526

మ. హనుమంతా యుపదేశ మిచ్చెదను మంత్రాళింగొనంజాలుదీ
వనుమానం బిసుమంతలేదు చనుదెమ్మా పూతచిత్తుండవై
టను నీకంటెఁ బ్రియుండునాకొకరుఁ డుండంబోలునే కానఁ
జయ్యనరమ్మా యిసుమంతదక్షిణయునీయంగల్గునే నీకడన్.

—హనుమంతునిచేఁ గాలనేమి మడియుట.—

క. గురుదక్షిణ యీకున్నను
వరమంత్రములైనఁ గోరుభంగి ఫలములం
బరికింప నీయఁజాలవు
మరుత్సుతా! యన్న నతనిమాటల వినుచున్. 528

ఆ. పొరలివచ్చుచున్న భూరికోపంబున
నొడలెఱుంగకుండి యుద్ధతి దగఁ

గలదె దక్షిణ యనుకాలనేమి దురుక్తి
చెవులఁబడిన యంతఁ జెలఁగి యతఁడు. 529

చ. గురువర! నీకు నీయఁగఁదగుఁ గురుదక్షిణఁ దెచ్చినాఁడ నా
దరమునఁ గైకొనందగిన తాపసి వీవు సరోవరంబునన్
బరమజలంబులన్ మునిఁగి వార్చి తలంచినరీతిఁ గ్రోలితిన్
బరమముదంబుగల్గె నిదె వచ్చినవాఁడను సేవచేయఁగన్.

మహాస్రగ్ధర. అనుచున్ రోషంబు పొంగన్ హరిపతి కరివ
ర్యంబుపై కేగురీతిన్
హనుమంతుం డుగ్రరూపం బనఁజను తనువ
ట్లొంది ముష్టిప్రహారం
బనఁగా నొప్పారుచున్ దేహముఁ దగఁ దిలపి
ష్టాకృతిం జేయుశిక్షన్
ఘనమౌ మర్యాదగా నాకపటధిషణువ
క్షస్థలం బందు నిచ్చెన్. 531

క. ఆమర్యాదను గని వే
యామనుజాశనుఁడు హనుమయాశయము దగం
గా మది నెఱుఁగుచుఁ దనదౌ
నామునివేషంబు మాని యాక్షణమున నే. 532

మ. పెనుపక్షంబులు దీర్ఘచంచువులనిం బ్రీతిం గడుం దెల్పునె
ఱ్ఱనినేత్రంబులు విస్తృతిం గలిగి చట్రాలన్ వడిం జూర్ణతం
గన సంస్పర్శముచేతఁ జేయుపృథువక్షంబుల్ నిశాతంబులై
పెనుభీతిం గలిగించుగోళ్లు వెలయన్ వీరోజ్జ్వలత్వక్షియై.

చ. దురమొనరింపఁబూని వడితోఁ జనుదెంచి నిశాతచంచువి
స్ఫురణముమీఱఁ దాఁకుటయు శూరతరూపమునొందినట్లు

గా, మరుదధినాథపుత్త్రుఁ డభిమానము పొంగఁగ దానిఁబట్టి
భీ, కరదళయుగ్మముల్ విఱిచెఁ గాని యదృశ్యతనొందె నద్ది
యున్. 534

సీ. అంతలోనన భయదాస్యంబు దర్శన
మాత్రంబుననె దేహయాత్రఁ బూర్తి
నొందింపఁజాలిన యురుతరదంష్ట్రలు
శాతనఖంబులు భీతికరము
లయిన మీసమ్ములు నంతకు గళరవ
మును గ్రిందుచేయుకంఠనినదంబు
ప్రళయకాలోగ్రరుద్రప్రతిమానదే
హముగల్గి చూడంగ నైనఁదరము
తే. గాకయున్నట్టి పంచాననాకృతి దగఁ
బూని హనుమంతుఁ జంపంగఁ బై నడరఁగ
ననిలతనయుండు వానిమాయ యని యెఱిఁగి
యించుకంతయు భీతిలే కెలమి మిగుల. 535

శా. వాలం బూర్ధ్వముఖంబుచేసి రఘుభూపాలాంఘ్రియుగ్మం
బెదం, జాలన్ భక్తిన నిల్పి రావణుని దుస్తంత్రంబులో నెం
చి దో, ర్లీలన్ జూపఁగ నెంచి మాయఁ గొనుచున్ లీలా
మునీంద్రత్వమా, వేళం బూనిన కాలనేమిఁ దునుమన్
వీక్షించి సంరంభియై. 536

చ. ఘనతరముష్టిఁబూని తన కార్యము మోసముచేతఁ బాడుచే
యను దలపోసె నన్నక్రుధ నాత్మనుమించఁగసింహరూపుఁడౌ
దనుజునిమస్తకం బగుల దారుణకంఠరవంబు మించఁగా
ఘనుమ తటాలునం బొడిచె నాదృఢముష్టిహతిన్ విశీర్ణమై.

క. తలపగులఁ గాలనేమియుఁ
బలుకక యాచోట నపుడె వానరపతియై
గళరవ మట్టిదియై యి
ష్టుల దోఁపఁగ నిట్టు లనియె మోదము చెలఁగన్. 538

మ. హనుమంతా! యిట జాగుచేయఁ జను నే యాచోట సౌమి
త్రి యీ, శుని కారుణ్యమునన్ బరాకు విడి సచ్ఛుభాంగుఁ
డై లేచెఁ గా, మునియానందము నేమిచెప్పుదును మేముం
బ్రీతివర్ధిల్లఁగా, ననిచేయం దలపెట్టినార మల ద్రోణాద్రిప్ర
యాణం బిఁకన్. 539

చ. చనదు త్వరన్ ననుంగలిసి చాలినపూన్కి రణంబు చేయ నో
యనిలజ పూనవయ్య క్షణమైనను నిల్వఁగరాదు రమ్ము నా
హనుమయు భ్రాంతి మించ నితఁడౌఁ గపినాథుఁ డటంచు
నెంచి యా, త్మను గతవృత్త మెంచి యిది దానవుమాయ
యటన్న యూహచేన్. 540

క. ఆలస్యము చేయక యీ
బాలిశుఁ బొలియింతు నంచుఁ బంతంబున నా
కూళుని తలపగులంగా
గాలికుమారుండు పొడిచెఁ గడువడిముష్టిన్. 541

చ. పొడిచిన యంతనే ధరణిఁ బొర్లుచు మూర్ఛమునింగి తల్లడం
పడుచును లేచి చేయఁదగుపద్ధతిచే శతశృంగుఁ డాచుఁ బెం
పడర నఖంబులం బవనునాత్మజుఁ జీలుప నాగ్రహంబునం
దడ వొనరింపఁ గార్య మిఁకఁ దప్పు నటంచు నితాంత
యోజనన్. 542

చ. పరమరఘూత్తమాంఘ్రియుగపంకజముల్ మదిఁ జేర్చి దాన

వా, దుర మొనరింతు వే యనుచు, దోరపుశక్తిని ముష్టిఘట్టన
స్ఫురణమునం దలంబోడువ సోలి ధరంబడి సంజ్ఞదప్పి యీ
ధర నిఁక నుంటయెట్టులని తానవమానములోఁదలంచుచున్.

చ. చనియెనొ యేమొ యన్నగతి శ్వాసస్థలిఁ బాసి సురాలయంబు
నొం, దెను; హానుమంతుఁ డిట్లు సుగతిం దగఁబొందినకాల
నేమి దా, తనువును గాంచి చచ్చితివె దానవుఁడా యని
నాల్గుదిక్కులం, గనుఁగొని జాముయాత్రి యుఁకఁ గల్గును గా
ర్యము పెద్ద చూడఁగన్. 544

చ. ఎపుడొనరింతునోయెఱుఁగనింకిటనిల్వఁగరాదు ద్రోణభూ
ధ్రపతికిఁ బోయెదం ద్వరఁగ రామునికార్యమిదెట్లుసాగునో
కపటసురారిమారణము కాఁగలదో యెటులంచుఁజింతతోఁ
దపనజమంత్రియేగె నలధాత్రిధరంబలరారుచోటికిన్. 545

హనుమంతుఁడు ద్రోణాద్రిం బెకలించి తెచ్చుట.

తే. ధాన్యమాలిని చెప్పినంతయును జరగె
నట్లెయని విస్మయంపడు చనిలసుతుఁడు
వాయువేగంబు మించినవడువునఁ జని
యెను గిరీంద్రంబు గల్గినయెడకుఁ గడఁక. 546

చ. చనునపు డెన్నియోగిరులు సాధుతపోవనముల్ వనంబులుల్
ఘనతరసత్తటాకములు కమ్రపయఃపరిపూర్ణవాపికల్
కనఁబడవానిఁ గాంచుచు నికామజవంబున ద్రోణశైలముం
గనుఁగొనువేడ్కఁ బోయెఁ గపికాంతునిమంత్రి యుదారస
త్వుఁడై. 547

చ. చనిచని ముందుఁగాంచె ఘనసత్త్వమహారవఘూర్ణితాయత
ప్రణుతదరీకదంబము, విభాసురభూరిసరోవరోత్థపా

వనజలపూర్ణనిర్ఘరవిభంగతరంగతటప్రఘట్టనో
త్థనినదశర్మదంబు గురుదైవతబృందము ద్రోణభూధ్రమున్.

వ. మఱియు నప్పరమపావనపర్వతంబు జ్యోతిర్లతావితానంబగు
టఁ దారాపథంబు ననుకరించుచుఁ దేరిచూడరాక యంబ
రంబు స్పృశించుచు మహోన్నతంబై నేత్రపర్వంబై యొప్పు
చుండె నంత. 549

క. హనుమంతుఁ డంత నగ్గిరిఁ
గనుఁగొని యిదియేమి, దీపగణభూషితమై
వినుతింపఁ దరముగా క
త్యనుపమసంపదల నొప్పె నభిరామంబై. 550

క. అని చెంతకు జని గగనం
బున నిల్చియె భక్తిభావపూర్ణుం డగుచున్
మనమున రాఘవుఁ దలఁచుచుఁ
బని యిది రాఘవుని దనుచుఁ బ్రార్థనతులచేన్. 551

క. వందన మొనరిచి సురగణ
వందితపాదారవిందభాసురుఁ డగుచున్
బృందారకవరవినుతిం
బొందుగఁ గను శ్రీరఘూత్తమునికార్యంబున్. 552

క. సురహితమును సాధింపఁగ
నరుదెంచితి నిన్నుఁజూడ నద్రివరా! నే
మరుదాత్మజుండ నిను నే
శరణం బని వేఁడువాఁడ సదయుఁడ వగుమీ. 553

సీ. పర్వతోత్తమ! నిన్నుఁ బరమాదరంబునఁ
జూడవచ్చితి నీదుశుభగుణములు

లోకవిశ్రుతములు పాకశాసనముఖ్యు
లనవరతము నిన్నె యాశ్రయింతు
రఖిలపావనుఁడ వహార్యబలుండవు
పర్వతేంద్రుఁడవు నీపాటిసేయు
భూధ్రంబు లిలలేవు పో, ప్రాణ మిచ్చెడు
లతలు నీయందుండువితమె దీని
ఆ. నమరఁ జెప్పుచుండు నమలమనీషుండ
వింతయేల సహజమ్మెగద నినుఁ
బోలువారలెల్ల భూతోపకృతి యొప్ప
చేయుచుందు రనుట సిద్ధమెకద. 554

చ. అనుజుఁడు రావణాసురుని యద్భుతశక్తిని మూర్ఛపోయి మే
దిని బడియుండఁ జూచుచు మతిస్థిరతన్ విడి రామచంద్రుఁడా
యనుజునిప్రాణముల్ నిలుప నర్థ్యములౌ లతలుండు నీమహా
తనువున నంచు నన్ననిపెఁ దావకపుణ్య మదెట్టిదోకదా.
ఉ. రాముని కార్యమే త్రిదశరాట్ప్రియ మట్టిది సార్థకంబుగా
నీమము మీఱఁ జేయుటకు నీకల రెండగుశక్తి, భూధ్రమా
యేమని సన్నుతింతు నిను నేను భవత్సుకృతంబు సాటియౌ
నేమహి నెన్నిపుణ్యము లవేమిప్రసిద్ధము లెన్నిచూడఁగన్.
చ. జగములుమూఁడు రాఘవునిసత్ప్రియలన్ ముదితాత్మఁజేయఁ
గా, దగునదియే తలంప సుఖదం బని యెంచుచు నున్నవాఁ
త్మనో, యగవర! యట్టిరాఘవుని యాజ్ఞను దాల్చి వచ్చి
నాఁడ ని, న్నుఁ గనఁగ నాదు కార్య మిది నుత్యము ము క్తిద
మౌఁ దలంపఁగన్. 557

చ. కనుకనె విన్నవించితిని గార్యభరంబును దీనిఁజక్కఁగా

మనమున నెంచి వేగ మఱుమాటయె పల్కక చేయవయ్య, చ
క్కనిలత లవ్వియున్న ధరఁ గన్పడఁ జేయుము పూజ్యబుద్ధి నేఁ
గొని చనువాఁడ రాఘవుని కూరిమితమ్ముని రక్షణార్థమై.

సీ. సంజీవకరణియు సంధానకరణిలో
నుగ నొప్పుతీఁగలను దయ నెందు
నల రారుచుండునో యావిధ మెఱిఁగింపు
మనుచు వేఁడుచు భక్తివినయములను
గనఁబఱుచుచు నట్టె చని యాగిరీంద్రంబు
పయి వ్రాలె; నిట్లు లాపవనతనయుఁ
డద్రిపైఁ గాల్మోన నామహాభారంబు
నోర్వఁజాలక కొండ యుర్వియందుఁ

తే. గ్రుంకె; నత్తాఁకునను వృక్షకూటము లవి
చలన మొందెను వానిపై నిలిచియున్న
పక్షు లెల్ల సుషుప్తిని బరఁగుచుంట
నట్టె ధరఁబడి ధ్వనులు సేయంగసాగె. 559

చ. ధరణిధరంబుపై నిటు సదాగతిపుత్త్రుఁడు చక్కనిల్చి యా
దరమునుభక్తియుందనరఁదానలుదిక్కులుగాంచియెంతొయ
చ్చెరువును బొంది యౌర! యిదెచేరఁగసాధ్యముగానియట్లు
గాఁ, బరఁగెడుదీనియందలరుభవ్యలతల్ గనసాధ్య మెట్లగున్.

ఉ. నాలుగుదిక్కులం గనిన నవ్యవిధంబుగఁ దోఁచె నిద్ధి, భూ
పాలునిమ్రోలఁ బల్కితిని బంతము లెన్నియొ వానిసత్యమౌ
పోలిక నెట్లు చేయనగు? బుద్ధికిఁ దోఁప దొకించు కేనియుఁగా
జాలము చేయరాదిట నిశాపరి శేషము సుంతరైుు తగున్. 561

చ. అని తలపోసి తూర్పు మొగమై నిలువంబడి చేతులొగ్గి రా

మునిపదపద్మముల్ హృదయముగ్ధసరోరుహపీఠమందు ని
ల్పి నియతిమీఱఁగాఁ బలికెఁ బృథ్విధరా! యనుకంపఁ బూని
నాపనికి సహాయమై కడుజవంబున నేఁ జనునట్లు చేయుమా.

చ. గిరివర! నీపయింగలవు కేవలతేజము నిండియుండఁగాఁ
బరమములై యసుప్రదత భాసిలఁ గాఁ దగునోషధివ్రజం
బరిజనకాలుఁడౌ రఘుకులాగ్రణితమ్ముఁడు లక్ష్మణుండు సు
స్థిరబలుఁ డుర్విపైఁబడియెఁ జెప్పఁగరాని దురంతరవేదనన్.

తే. అట్టి సౌమిత్రి బ్రదికింప నర్హములగు
నోషధులు నీపయింగల వొప్పమీఱ
వానిఁ జూపింపవయ్య! యవార్యతేజ
భూధరోత్తమ యుపకారబుద్ధిగలిగి. 564

ఉ. చెప్పఁగనేల? కార్య మిది చేయఁగ నర్హమటంచు లోకముల్
తప్పక రావణాసురుని దారుణకృత్యముఁ గాంచి రోసి నీఁ
డెప్పుడు చచ్చునో యనుచు నెన్నివిధంబులనో తలంచువా
రప్పని నీదుసాయమున నౌఁగద, చేయఁగరాదె వేగమే.

చ. ధరణిధరేంద్ర! నీకొదవె ధన్యత నేఁటికి, నిన్నుఁబోలు సు
స్థిరయశుఁడింకఁ గల్గునె మదిం దలపోయఁగ, రాముకార్య
త, త్వరుఁడెకదా మహాత్ముఁడన భాసిలునట్టి యదృష్ట మబ్బె
నీ,కరయఁగఁ దత్ప్రియత్నముగనప్పనిఁదీర్పకయుండఁజెల్లునే.

చ. సురవరులెల్ల నీపనికిఁ జోద్యము నొందెడునట్లుచేయుమో
ధరణివరా! యటంచు వివిధప్రియభాషలవేఁడి యంత
నా, తురమున నందు నందుఁ గనఁ దోరపుఁగాంతిని నగ్నిఁ
బోలు సుం, దరలతలం గనుంగొనియెఁ దద్ధరణీధరసాను
సంతతిన్. 567

చ. కనుఁగొని చాలవేగమున గాలికుమారుఁడు పోయిచూడఁ
గా, ననుపమకాంతివెల్గులత లచ్చటి కంతటి దూరభూమి
నిం, గనఁబడె నాస్థలంబునకుఁ గ్రన్ననఁబోవఁగ నంతదూర
మం, దు నవలఁ దోఁచెఁగాని వ్రతతుల్ స్థిరతం గనకుండె
నంతటన్. 568

క. తనవేగంబంతయుఁ జూ
పి నితాంతశ్రద్ధఁబోయి వీక్షించిన నా
ఘనలతలు దూరముననే
కనఁబడఁగా సాగె నించుకయు నయ గనిమిన్. 569

క. హనుమంతుఁ డెంతవేగం
బునఁ బోవునో యంతవేగమున నోషధులుం
జనుఁగాని నిశ్చలతనుం
గనవేమిది యనుచు నతఁడు కలవలమందన్. 570

క. తిరుగుచు నెల్లెడలఁ భూ
ధరసానువు లల్లె తగునితంబంబులు కం
దరములు కనుచుఁ విసుగున
మరుదాత్మజుఁ డొకటనిల్చి మదిఁ గ్రుధ పొదలన్. 571

క. తలపోసె నిట్లు; భూధ్ర
స్థల మెల్లను జూచినాఁడ దారుణవేగం
బలరార నేమికతమో
విలసల్లతలుండ వొకట వేగమ పోవున్. 572

క. ఆలోచింపఁగ నీగిరి
బాలిశుఁగా నన్ను నెంచి బహువిధమాయా

శీలంబై యలరారెడు
పోలిక తెలియంగనయ్యెఁబో, యకటకటా! 573

క. ఏనెంత వేఁడినన్ గడు
ధ్యానముగొని పలుకదయ్యె ధ్మాధర మారా!
కానంజేయందగు నా
భూనాథునిభటునిశక్తి భూజను లెఱుఁగన్. 574

క. ఇంకను నే నిటనుండిన
శంకయె లేదచట రామజనపతిసహజుం
డింక బ్రదుకండు తపనజుఁ
డంకిలిలే కంత మొందు నని మొనయందున్. 575

క. కనుక మదాయత్తం బీ
పని గావున శంకమాని బలము నెఱుఁగఁజే
యనుదగు భూధరమున కని
తనమదిఁ దలపోసి మారుతప్రభుసుతుఁడున్. 576

క. ధరణీధరముం గనుఁగొని
పరమాద్భుతరీతిఁ దెలుపుభంగి ద్విగుణమై
పరఁగెడురూపము తగ నా
తురపడుచుం గార్యభరము తోఁచుట కతనన్. 577

తే. అపుడు గఱచుచు జడమతీ! యాదరమున
నెంత వేఁడిన మాటాడ వింతగర్వ
మలరె నీయందు నీవన నతిదురాత్ముఁ
డవని యెంచెద విను మేను బవనసుతుఁడ. 578

ఉ. తోఁకను నిన్నుఁ జుట్టి వగతో దురపిల్లెడు రాముముందు
నీ, యీకడుగర్వ మూడునటు లేపున గిర్గిరఁ ద్రిప్పివైవఁ

గా, నోకపటాత్మ! చాలుదు మదుగ్రబలంబు నెఱుంగఁజాలకి
ట్లీకఠినత్వముం గొనితి వింతియకాని మఱొండుకాదుసూ.

ఉ. ఇంతటనైన నీదగు నహీనపరాక్రమ మెల్ల మాని దు
ర్దాంతరఘూత్తమప్రబలదర్పముఁ జక్కఁదలంచి నేను ని
న్నింతగ వేఁడుచుంట మది నించుకయైనఁ దలంచి యాల
తల్, వింతగఁ దోఁచు నాస్థలము వేగమ చూపుమ, జ్ఞాన
మూనుమా. 580

ఉ. జ్ఞానము లేశమైనఁ గనఁజాలదు ప్రస్తర, మవ్విధమెల్ల నె
చ్చో నొకచోటఁ జేర నది క్షోణిధరంబనఁ జెల్లుఁగాదె య
ద్దానికి జ్ఞానమె ట్లమరు దానిని వేఁడు టదెంతవెఱ్ఱి పెం
పూని పరాక్రమంబుఁ గన నొప్పుగఁ జేయుదుఁ గార్యవాదినై.

తే. చెఱుకు బెల్లముపెట్టునే చేయఁదగిన
పనిని జేయకయున్న నే మనవిచేయ
నించుకంతయు గ్రహియింపఁ డీజడాత్ముఁ
డింక నేఁ జూపువాఁడ మదిద్ధశక్తి. 582

వ. అనిపలికి పండ్లు పటపటధ్వని సేయ బాహువులు తమంత
నెగురుచుండ వాలంబు దుర్వారక్రోధావేశంబున నిక్కి పర్వ
తం బొక్కటి విసరివేయ నుంకించుచుండఁ గఠోరాట్టహాసం
బొనరించుచు బుసగొట్టుచు నలుదెసలం బరికించుచుఁ గార్య
భరంబుఁ దలంచుచునంతకంత కుప్పొంగుక్రోధరసంబు నాపం
జాలక దావపావకు వీఁక మండిపడుచుఁ బ్రళయకాలమహో
గ్రతేజస్సందీప్తనేత్రగోళవిరాజమానత్రిలోచనుకరణిఁ జూ
పులం బఱపుచు, గ్రీష్మమధ్యాహ్నకాలప్రచండకిరణుం డగు
మార్తండునివైఖరిఁ గనఁబడుచుఁ, దావచ్చినకార్యంబును,

గాలనేమికృతమాయావనసందర్శనంబుఁ దలంచి ప్రొద్దు చాలగడచుట కుమ్మలించుచు మఱియు నాపర్వతంబుం జూచి యిట్లనియె. 583

ఉ. పర్వతమా! మఱొక్కపరి ప్రార్థన మేనొనరించువాఁడ రా మోర్విభుండు దీనుఁడయియొప్పు దొలంగఁగ నున్నవాఁడు సూ, గర్వము మాని యాలతలు గ్రాలెడు తావును జూపు చూపవే, సుర్విని నీదునామ మిఁక నుండదు నమ్ము త్రిశుద్ధిగా మదిన్. 584

ఉ. శృంగములెల్ల డుల్ల సొగసేదిగుహావళియెల్ల రూపఱన్ భంగమునొంది వప్రసమవాయము తల్లడమంద నీపయిం బొంగుచుఁ గ్రీడసల్పు సురపుంగవు లార్తినిబొందనే నిఁకన్ నింగిని నిన్నుఁగొంచుఁ జని నేత్రసమీపముఁ జేర్తు నమ్ముమా.

చ. అనిలకుమారుసత్వ మిది యారయ కేమొయటంచు నెంచి నీ మనమున భీతిలేక యభిమానము మీఱఁగ నున్నవాఁడవే ఘనుఁడ నటంచునీవు,తృణకల్పుఁడవయ్యె మహీధరా! యిఁకై నను గడునప్రమత్తుఁడెయనందగియుండుము సాధువృత్తిచేన్.

ఉ. నామదిఁ గోపమే కలిగినన్ క్షణమాత్రములోన రూపఱం గా మదుదగ్రపౌరుషము గాటముగా నొనరించుఁ జుమ్ము నీ దామహిమంబు నాయెదుట నల్పతమంబుగదా మహీధరా! రామనృపాలుకార్య మిది ప్రాణసమం బగునాకుఁ గావునన్.

క. ఒనరింపఁ దగిన దట్లొ
టను నీ విఁక నైన నాకడంకకు విఘ్నం
బొనరింపఁ బూన కొయ్యనఁ
బని తీర్పుము నేను బోవవలయుం ద్వరఁగన్. 588

క. ధరఁ బడియున్నాఁ డలభూ
వరుతమ్ముఁడు లక్ష్మణుండు భానుఁడు ప్రాగ్భూ
ధరమునఁ బొడసూపినచో
మరణం బాతనికిఁ గల్గు మాట లిఁకేలా. 589

క. కావునఁ ద్వరగా నాసం
జీవకరణి లోనుగాఁ బ్రసిద్ధిని గను నా
పావనలతలం జూపుము
వేవేగ గ్రహించి వాని వెడలుదు నేనున్. 590

క. ప్రతివచనం బీయక యీ
వితమున గర్వంబె పూని విమతులపక్షం
బె తగఁగ సార్థకముగఁ జే
యుతమిం గొనియుండువే మహోద్యమ మొప్పన్. 591

క. మును హెచ్చరించినట్లుగఁ
బనిఁదీర్తును నే నొనర్చుప్రతిన మరలుచం
గను రా దదేరికైనన్
హనుమంతుఁడఁ బలుకువాఁడ ననిలతనయుఁడన్. 592

క. అనిపలికె నంత భూధర
మనిలజుపల్కులకు భీతి నందక పూర్వం
బున నున్నయట్ల యుండెను
బని తీర్పక మాఱుమాట పలుకక భీతిన్. 593

చ. హనుమయు నవ్విధంబుఁ గని యద్రిపయిం జెలరేఁగుక్రోధ
మూ, పను దనచేతఁ గామివడిఁ బంతముమీఱఁగ హుంకరిం
చుచున్, ఘనతరవాలముం బెనచి క్ష్మాధర మొయ్యన నెత్తి

కొంచుఁ బో, వను దలపోసి రామవిభు భావమునం దమినిల్పి, యుద్ధతిన్. 594.

సీ. దశయోజనోన్నతత్వంబును దన్మాత్ర
విస్తారమును గల్గి వెలయుదాని
గంధర్వకోటిని కామరక్షణమునఁ
దగుదాని సత్వసంతతులఁ జేర
రాక యభేద్యమై భీకరధ్వని మించు
నా ద్రోణభూధ్రంబు నాత్మవాల
మునఁజుట్టి యింక నేమొనరింతువో చూతుఁ
గాకని యవలీల గాఢశక్తిఁ

తే. బెఱికె; నంతటఁ బటపటవితతశబ్ద
మొక్కమొగిఁ బర్వి భయదమై యురుతరమ్ముగ
సంతతులు భీతిఁ బాఱెడుచప్పుడు లోఁగి
నెల్లయెడలను బర్వి భీతిల్లె జగము. 595.

చ. తరువులు వంగఁ దీఁగలు నితాంతము తత్తఱపాటునొంద నిర్ఝర ముదమొప్పఁ జేడియలబాలకులన్ జతఁగూడి గూండ్లయం, దురు సుఖనిద్ర చేయుపతగోత్కరముల్ కలఁతం గనంగ నా, ధరణిధరంబు చేడ్పడియెఁ దత్పవనాత్మజు పౌరుషక్రియన్. 596.

క. వడివడి గండోపలములు
జడివానకుఁ బ్రతిగ నదులజలములఁ బడుచ
ప్పుడు విన దుస్సహమై యి
ప్పుడె ప్రళయం బనెడునూహఁ బుట్టించెఁ గడున్. 597

క. ఫలములు జలములరాలఁగఁ
గలిగిన యాచప్పు డెల్లకడలఁ బ్వ్యాపిం
చె లతావిసరమ్ములలోఁ
జెలఁగెడు శకునములధ్వనులు చిత్రతరములై. 598

క. గిరియం దంతట బెఱసెను;
ధరణీధర మద్ది యప్డు దస్యునికాయాం
తరమునఁ జిక్కినకామిని
కరణిఁ భీతిల్లి దిక్కు గలదే నాకున్. 599

చ. వనచరుఁ డీతఁ డెవ్వఁడొ యవార్యబలోద్ధతి నన్నుఁబట్టి స్వే
చ్ఛను గయికొంచుఁబోయెడిని సాధ్వస మందెడునామనంబు
న,న్నునుపుగఁ గావరే ఘనదయాకరులౌ సురలార! మీకుఁగా
వనుదగుశ క్తియొప్పెడిని వైశమ రండు కపీంద్రు నిల్పుఁడీ.

చ. అసువుల నిచ్చునోషధుల నాశరుపత్తనసీమ కీతఁడే
వెసఁగొని పోవువాఁడకటవీనియహంకృతి మాన్పరయ్యమీ
కు సహజమేకదా యొరులకుందును మాన్పుట నిర్జరేంద్రు
లా, ర!సమయమేగ నవ్వలధరాధరముం గృపఁగావ శక్యమే.

వ. అని పలుకుచందంబునఁ బ్రతినాదమిషచే దనమూర్తిని దెల్పు
చుండునంత హనుమత్కృతభయంకరానన్యసాధ్యకార్యం
బెఱింగి యబ్భూధరంబు ననవరతంబుఁ గాచు పదుమూఁ
డుకోట్లగంధర్వవీరులు చెలరేఁగి యౌరా!కండకావరంబున
నుద్దండబాహుబలవిరాజితులమగుమమ్ము లెక్కచేయకయిక్క
ఢి యిక్కరణి నుక్కుమీఱి నిక్కలాచలంబుఁ గొనిపోవునే
యని యొండొరులం బిలుచుచు బాణకుంతతోమరముసలా
ద్యాయుధంబులఁగొని నిలునిలు మెందుఁబోయెద వెవ్వండ

విట్టి యకార్యం బేలచేసెద వని పలుకుచు, నస్మద్భుజాదండ
నిక్షిప్తకోదండనిర్గతోద్దండకాండంబుల నీశరీరంబు తిలప్ర
మాణశకలంబులగునని హెచ్చరించుచు, శరపరంపరలువఱ
గించుచు, నస్త్రంబులఁ బ్రయోగించుచు నాయుధంబులం
బొడుచుచు భల్లంబుల విదళించుచుఁ గుంతముసలాదుల
మే నుచ్చిపోవ నాటుచు భయంకరంబుగాఁ బోరుసల్పు
చుండి యంత. 602

గంధర్వులు హనుమతో యుద్ధముచేసి యోడుట.

చ. వలవదు వానరా! యిది యవార్యభుజాబలరాజితామరా
వలి తనుఁగావ సంపదలభాసిలుచుఁ దనసాటిలేక యు
జ్జ్వలతమవీరుదున్నతిని శాశ్వతభాగ్యనిధానమై మహా
చల మన నొప్పుదేవతల శాశ్వతవాస మిదా తలంపఁగన్.

ఉ. దీని హరింపఁగా వశమె దేవవరేణ్యులకైన దెప్పుడుఁ
మానుము చేయఁబూనుపని మానవయే నినుఁ జుట్టుముట్టిదు
ర్మానము తూలఁ దీక్ష్ణతరమార్గణజాలము వైచి ప్రత్తు మో
వానర! వేయిమాటలికఁ బల్కఁగ నేటికి? నాఁగ పీంద్రుఁడున్.

ఉ. వారలు పల్కుభీతికరవాక్యములన్ విని యించుకేని గం
భీరత మాన కుగ్రుఁడయి వేగమ వాలము పెంచి యింక మీ
దారి కనుం డటంచుఁ గడుదర్పము చూపఁగ నెంచి నిర్జరుల్
ఘోరరణంబిదంచు వెతఁగుందఁగ జేయఁదలంచియంతటన్.

ఉ. వేలకువేలుగా దివిజవీరులు నొక్కటఁ జుట్టిచుట్టి యా
భీలగతుల్ చెలంగునటు వేడుకమీఱఁగ వీచి వైచె; నా
వాలజవాతధూతులయి వారలు సంద్రమునందు నార్తులై
కూలిరి; కొందఱన్ మరలఁ గ్రూరతవాలముఁ బెంచిచుట్టుచున్.

క. ధరణిఁ బడవైచెఁ గొందఱ
మరలఁ బడిఁజుట్టి వీచి మహిఁబడి చావం
గ రహి నొనరించెఁ గొందఱఁ
ద్వరపడి యెందో పడంగ వైచెం గడిమిన్. 607

తే. ఇట్లు గంధర్వనాయకు లెల్ల దిక్కు
మాలి చీకాకుపడఁజేసి మారుతాత్మ
భవుఁడు సింహనినాదంబుఁ బర్వఁజేయఁ
నదరిపడి హతశిష్టు లి ట్లనిరి భక్తి. 608

క. మరుదాత్మజ! నీశక్తి
స్ఫురణం బెఱుఁగంగ లేక శూరత నీకుం
బరిభవము గలుగఁజేయం
ద్వరపడితిమి కావవయ్య దయ మెయి మమ్మున్. 609

ఆ. బుద్ధి చాల లేమి భూరిభవచ్ఛక్తి
నెఱుఁగ లేమి విఘ్న మిట్లు చేయఁ
బూనితిమి క్షమింపు మో నిర్భరోదగ్ర
విక్రమాఢ్య సాధువినుతచర్య. 610

చ. ధరణిధరంబు దీనిఁగొని తావకచిత్తమురీతి నేగుమా
సరగున నంచుఁ బల్కి మఱిసన్నుతులం గొనియాడ నంజనా
వరతనయుండు భూమిధరవర్యము హస్తతలంబునందు బం
గరువలయంబుగాఁ గొనుచు గాఢజవంబున మింటిదారిచేన్..

క. పరుగిడె; నాతనిజవ మది
గరుడుని వేగంబు మీఱి గాడ్పుజవంబుఁ
గరము విహసించి యొప్పెను
దరమగునే దానిఁబొగడ ధాతకు నైనన్. 612

క. కరమునఁ బర్వత మలరఁగ
సురజవమున మింటి కెగసి సుర్వీపతియై
పరఁగు రఘురాముఁ జూడఁగ
నరుదుగఁ జనుచుండె భీతి నందని మదితోన్. 613

భరతునకు దుస్వప్నములు తోఁచుట.

చ. హనుమయు నిట్లు పోవుతఱి నచ్చట నారఘురాముతమ్ముఁడై
ఘనమతి భాసురుండు నయ గ్రాలెడు నాభరతుండు రేయి ని
ద్రనుగనుచుండి యందు రఘురాముఁడు లక్ష్మణుఁడెంతో డస్సి
వే, దనఁ గనుచుండినట్లు గను ధాత్రికుమారియు దుఃఖి
తాత్మయై. 614

తే. చాల వందురుచున్నట్లు స్వప్నమందుఁ
గాంచి తల్లడనుందుచుఁ గడు వగచుచు
మేలుకని యశ్రుజలముల మేనుదడియ
భూసురుల నప్డె రావించి పొదలుభక్తి. 615

క. తనకుం దోఁచినస్వప్నక
థను దెల్పిన వారు దానితత్త్వమ్మును జ
క్కనిబుద్ధి నెంచి పాచిత
మును దెల్పిన నియతిసలిలముల మున్గి తగన్. 616

ఆ. ఆచమించి భూసురాళికి గోభూము
ఖంబు లగుచు బహువిధంబులైన
దానముల నొసంగి మానితాత్ములకప
మృత్యుబాధ లేక యొసఁగునట్లు. 617

క. తిలిసురు లాశీర్వాద
ప్రతతి నొసంగంగఁ దృప్తిపడయనిమదితోఁ

గృతకృత్యత నే నిఁక నే
గతిఁ గాంతునొ యనుచుఁ జాలఁ గళవళపడుచున్. 618

క. రాముని లక్ష్మణు సీతను
వేమాఱు తలంచుకొనుచు విహ్వలుఁ డగుచున్
భీమారణ్యంబుల రఘు
రాముం డెట్లున్నవాఁడొ రక్కసులందున్. 619

ఆ. పెక్కుమందియుంట విన్నాఁడఁ గావున
నేమి చిక్కువారి కిప్పు డొదవె
నొక్కొ లేకయున్న నుగ్రతరస్వప్న
మిట్లు లేలవచ్చు నేమిగతియొ. 620

క. పదునాల్గువత్సరంబులు
కొదువ రవంతగఁ దగంగఁ గొనసాగెఁగదా
తుది యగునిక్కాలంబున
నొదవునొ యేయేవిపత్తు లుగ్రపువిధిచేన్. 621

క. అనుచుం గటకటపడుచున్
జనిరొ గృహాంగణము వీడి చయ్యన నచటన్
మనమున నేమో తలఁచుచుఁ
గనిరొ వియద్వీథిఁ జనెడుకపివరు నొకనిన్. 622

చ. ఘనతరపర్వతంబుఁ దృణకల్పముగా శిరమందు నొప్ప న
త్యనుపమవేగమొప్పఁ ద్రిదశాలయమార్గమునందుఁ బోవునా
తనిఁ గనివీఁడెయొక్కఁడని తాంతజవంబునఁ గొండఁగొంచుద
క్కినమున కేగువాఁడుతమకిం చెడువాఁడురణంబుచేయఁగన్.

క. ఈతం డసురుఁడొ దుర్గ్రహ
మో తెలియఁగఁజాల ననుచు నూహించుతఱిన్

వాతాత్మజుండు భరతుని
ఖ్యాతగుణాకరుని నచటఁ గాంచెం గడఁకన్. 624

సీ. ఘనఘనశ్యామలతనువు రాజిల్లంగ
వల్కలాజినములు వరుసఁ గ్రాల
నీలజటాభార మోలిఁ గన్పడుచుండ
శాంత మాకృతిఁ బూను వింత యలర
రాముని యంతటి ప్రాయంబు చెలువార
భ్రాతృభక్తి మహాభరణముగాఁగఁ
దీనత్వమే పరాధీనతఁ దెలుపంగ
నిశ్చలస్థితిచింత నెఱిఁబలుకఁగ
తే. నింగిఁ జూచుచు శ్రీరాముని దదనుజు
జానకీదేవి దలఁచుచు స్వాంతమడల
వారి కేకీడుమూడునే వనమున నని
వెతలఁబడుచున్న భరతుని విమతహరుని. 625

చ. కనుఁగొని రాముఁడే యితఁడు కాఁదగురూపము వల్కలా
జినా, దినిఖిలచిహ్నముల్ వరుసఁ దెల్పుచు నున్నవి రామ
మూర్తియే, యని యని లక్ష్మణుండు. తెగ నాతని నచ్చట
డించి వచ్చెనో, మనుకులసంభవుం డనుచు మామకచిత్తము
నందుఁ దోఁచెడిన్. 626

క. అనుచుం దలపోయుచు నీ
ఘనునిక సత్యంబు నడిగి కనుఁగొనియెద నం
చును నెంచి యంతలో రా
మునిసద్గుణజాల మెన్ని మునుకొనుకడకన్. 627

క. శ్రీరాముండే సూనృత
మీరీతిగ విడిచి యిచటి కేతెంచునొకో
యారయ లక్ష్మణు వపమృతి
చేరునొకో యేల యిట్టి చింతలు నాకున్. 628

చ. కలుగును రామభద్ర ఘనకార్యములందునువిఘ్నజాలముల్
కలిగిన నవ్వి తూలములు గాలికిఁ బోయెడునట్లు పోవవే
తులువలు రామమూర్తిపయిఁ ద్రుళ్లుచుఁబోయిన ప్రంద
కుందురే, కలవిలపాటు గాంచుటకుఁ గారణ మారయఁ
జాల నీయెడన్. 629

క. అనుచుం జనుసమయంబున
మనువంశాభరణ మనఁగ మహేంద్రా లేదు రా
మునితమ్ముఁ డంతలో నా
హనుమంతుని దుర్గ్రహంబ యని యెంచి వడిన్. 630

క. పాలియించెద దీనిని నేఁ
జలమున నని వింట శరము సంధించి మహా
కులమతియై విడువంగాఁ
దలఁచెడుతఱి మింటనుండి తతనాదయుతిన్. 631

క. పలు కొక్కఁడు వీతెంచె న
మలగుణ! నీ కితఁడు చాలమాన్యుఁడు చుట్టం
బెలమికిఁ బాత్రుం డుపకృతి
గలిగింపఁగఁ జాలువాఁడు కపిగణవరుఁడున్. 632

క. పరమోపకార మొనరుప
నరుగుచు నున్నాఁడు కోప మనుమాటయె యీ

హరివరుపై నునుపం దగ
దురుగుణనిలయా! యటంచు నొప్పుగఁ జెప్పన్. 633

క. ఆవాక్యము శ్రుతులం జొర
గా వంచినవిల్లు దించి కాకుత్థ్సకులుం
డావిర్భవదురుమోదుం
డై వఱలుచు శయ్యఁజేరె నంత హనుమయున్. 634

చ తలపయిఁగొండయుండఁగని తాంతజవంబున రాత్రిపోయెడుం
గలఁగుచు రాఘవుం డెటులుగాదిలితమ్మునిఁజూచిదుఃఖమగ్న
జలనిధిలో మునింగెనొ నిశాచరులే కపటంబు పన్నిరో
తులువలుగా రెరాక్షసులుదుష్టమతుల్ వ్యథఁగూర్పకుందురే

మ. అనిచింతించుచువేగపోయిరఘువంశాంభోధిపూర్ణేందునిఁ
గనుకొర్కెఁ లవణాబ్ధిఁజేరఁజనఁగాఁగ్రవ్యాదసంఘేంద్రునా
జ్ఞను సేనాయుతిమాల్యవంతుఁడనురక్షశ్శ్రేష్ఠుఁడత్యుగ్రుఁడై
హనుమంతుఁ వడి నిల్వరించి యనునుద్యన్నీలమేఘధ్వనిన్.

క. అరిగెద వెక్కడికో వా
నర! గండోపలము శిరమునం దిడుకొని సా
గరమున వీరుఁడు వోలెఁ
బరికింపవు నన్ను శత్రువారశమునినిన్. 637

క. పొగరెక్కినదో మూఢత
యగచరులకు నైజమాట నది గుదిరినదో
తగవే నీ విటు పోవఁగ
మగతనమున మారుకొనుము మాతో నిచటన్! 638

క. అని మాల్యవంతుఁ డాడుచుఁ
దనుఁ బోనీయక చెలంగి దారుణరూపం

బున నిల్చినఁ దత్తైన్యనికు
లనుమానము లేక తాఁకి యాశుగవితతిన్. 639

చ. తనమెయినిండఁ జొన్పుటయు దారుణబాణపరంపరల్ చొరం
దనువున రక్తధారలు నితాంతము గార సపుష్పకింశుకం
బనఁ జెలువొంది యుండఁగ మహత్తరకోపదవానలుండు పై
కొనఁదను నిల్వరించిరఘుకుంజరు కార్యముపాడు చేయఁగన్.

ఉ. రావణుఁ డెంచి యీకఱకురక్కసులన్ వడిఁ బంపె వీరు నం
జేవ చెలంగ మారుకొని శీఘ్రము చంపఁదలంచి రింక నా
భూవరుఁ జేరకున్న నిటుపూనిన కార్యము విఘ్నమౌఁ గదా
కావున వేగపోవలయుఁ గర్బురవర్యుల వీరి నిత్తఱిన్. 641

ఆ. చాలసేపు పోరుసల్పి నిచ్చట తగ
దుగ్రపౌరుషమున నురుతరముగ
వాల మేను బెంచి వార్ధిలో వైచెదఁ
జేరు లేకయుండఁ బౌరుషమున. 642

క. అని తలఁచి దానవుల బా
ణనికాయము లెక్కగొనక నాథుని శ్రీరా
ముని మనమున ధ్యానించుచుఁ
దనవాలం బట్టి పెంచి దానవవితతిన్. 643

క. వేలకువేలుగ నొకటిం
జాలుగ బంధించి వీచి సంభ్రమునఁ బడన్
లీలఁగ వైచెను గొందఱ
వాలంబునఁ జుట్టి వైచె వసుధం బడఁగన్. 644

క. కొందఱి కూపిరియాడక
మ్రందం గాఁ దోఁకఁజుట్టె మఱికొందఱు చా

వం దనపూనిక మెఱయం
గం దగవాలమున మోఁదెఁ గడువేగమునన్. 645

క. ఈవిధమున ద్రోణాచల
మేవరుసను గ్రిందఁబడక యే యుండఁగ నా
పావని కర మునిచి యనిం
గావించెడుదనుజవరులఁ గాలునిపురికిన్. 646

క. పనుచుచుఁ దాఁ జనుచుండుట
గని రాక్షసవీరుఁ డనఁగఁ గ్రాలుచు యుద్ధం
బునఁ బేరుగన్న మేటియై
యనఁగాఁ దగుమాల్యవంతుఁ డపు డుగ్రుండై. 647

చ. హనుమకు నడ్డమై నిలచియార్చుచునోకపి! యేమిపౌరుషం
బు నిచటఁజూపుచున్నవిధముంబరికించుటచోద్యమందె నా
మన మిఁకఁ జాలు నిల్వుము క్షమాధరవర్యము దీని సాగరం
బునఁ బడవైవు మేను నినుఁ బోర వధింపక పోవ నిచ్చెదన్.

క. కాదేని బాహుశౌర్యం
బూది నినుం జంపువాఁడ నూహించుకొనం
గాఁదగును హితాహితముల
నాదనుజునిక్రూరభాషణంబుల వినుచున్. 649

చ. మనమున నించుకేని యనుమానమునొందకయున్నమారుతిం
గనుఁగొని దానవుండు శితకాండములంబరఁగించినొంప వా
నినతఁడు లెక్కసేయకయె నీచుని వానిఁదోలంగఁదాఁకెన
ద్దనుజుఁడు దానిచేఁ గనలిదారుణశస్త్రము లట్టె వైచుచున్.

చ. హరివరుదేహమెల్ల వివరావళిగల్గి చెలంగఁజేసె భీ
కరదనుజాంబకంబు లిటు గాడిన నించుక నొచ్చి వాలముఁ

బరువడిఁ బెంచి తద్ధనువు బాణయుతంబుగ లాగివైచె సా
గరమున; దానఁ గ్రుద్ధుఁడయి కాలునిపోలిక మండి యా
తఁడున్. 651

మ. ధను వొక్కండు గ్రహించి జ్యాలతికసంధానంబు గావించి
మిం, చినవేగంబునఁ గర్ణముం దగులఁగాఁ జిత్రంబుగా
లాఁగి తీ, వ్రనిశాతాంబకసంతతిన్ విడిచి యారామాం
ఘ్రిసంసేవకున్, హనుమన్ జాలఁ దపింపఁజేయుచును, సింహా
ధ్వానమున్ జేసినన్. 652

చ. తనువు చలింపఁ జిత్తము నితాంతము క్రోధశుచిన్ జ్వలింప
మ, స్తనిహితపర్వతంబు గురుదారుణశృంగయుతిం దపింప
నిం, క నితనిఁ జంప నౌననెడు గాఢతరోహయు నంకురింప
నా, హనుమయు విక్రమించుచు భయంకరరీతిని దాఁకె
నాతనిన్. 653

క. ఆతాఁకునకే యాతఁడు
చేతోద్రఢిమంబు తప్ప స్మృతి యెచ్చటికో
యాతఱిఁ బోవఁగ రథమునె
యూఁతగఁ గొని యూరకుండి యుద్వృత్తి తగన్. 654

క. స్మృతి పూర్వరీతిఁ గల్గిన
హితమెయ్యది చేయ నంచు నెంచి జవమునన్
బ్రతియే లేదనఁ దగునా
యతగదఁ గైకొనుచు నిట్టు లనియె హనుమతోన్. 655

క. తులువా! బ్రదుకుదువే యీ
యిల నింకను దీనిదెబ్బయే నీ కంతం

బు లలింగూర్చును జుమ్మని
పలుకుచు గిరగిరను ద్రిప్పి పౌరుష మొప్పన్. 656

తే. విసరివైచిన హనుమంతుఁ డెసఁగురోష
మున వడిఁ వచ్చునాగద దనుజునిఁ గయి
సట్టి యుంకించి పట్టి మహోత్తరగతి
వీచివైచెను జలనిధి వీచులఁబడ. 657

చ. అతఁడు తరంగమాలికలయందుఁ దటాలునఁ ద్రెళ్లి లేచి యు
ద్ధతి ఘనశూలముం గొనుచు డగ్గఱి మారుతి నొంచెఁగాని
య, ద్ది తనువుసోఁకి తున్కలయి ద్రెళ్లెను భూస్థలి; మాల్య
వంతుఁ డీ, సుతసరవాయునందనుని శూరత కెంతయు నోర్వ
కత్తఱిన్. 658

క. గిరి నిందు వైవుమా నిను
నరుగం జోటిత్తు ననఁగ నాదనుజుని శ
క్తిరహితుఁ గ్రూరునిఁ గన్గొని
మరుత్తనూజుండు పల్కె మదిఁ దగుక్రుధచేన్. 659

క. నినుఁగొల్చి యేగువాఁడే
హనుమంతుఁడు దుర్మదమున నాడెదె యింకం
గనుమా నాపటుసాహస
ము ననుచు నద్దనుజుశీర్షమును బదహతిచేన్. 660

క. నొప్పింప రక్తధారలు
చిప్పిలఁగా మూర్ఛమున్గి చెచ్చెఱ స్మృతి రా
నిప్పులు రాలెడుచూడ్కుల
నప్పవనజుఁ జూచి యుగ్రుఁడై నియమమునన్. 661

తే. తనదు విశ్వాసమునకుఁ బాత్రమయి యొప్పు
శక్తిఁ గైకొని చిత్తనిష్ఠను సమంత్ర
కముగ వైచెను; బావని కఠినవక్ష
మందుఁ బడి శకలంబులై యది యిలఁబడె. 662

చ. తనఘనశక్తి తున్కలయి ధాత్రిఁబడం గనులారఁ గాంచి
యా, తని నిఁకఁ జంప నెవ్వగిది ధాతకునైన నసాధ్య మం
చు నె, మ్మనమున నెంచి యాసుమెయి మాఱట రుద్రుఁడు
వోలె నున్న పా, వనిఁ గని యట్టె మండిపడి భాసురఖడ్గము
కేలనందుచున్. 663

చ. ఇదె నినుఁ జంపు నిం కెచటి కేగెదవో కనుఁగొందుఁగాక
యం, చు దితిజవర్యుఁ డాతని యసుప్రకరంబులఁ బోవఁ
జేయు న, న్న దమక మూని వైవఁగ ఘనప్రభలం జనుదెంచు
ఖడ్గమున్, మది నిసుమంతగాఁ దలఁచి మారుతి పైకెగసెన్
జవంబునన్. 664

చ. హనుమను జంప వైచిన మహాత్తరసాధన మిద్ది యట్టె యా
తని నలుప్రక్కలం బొదలు దానవవీరులఁ బెక్కుమందిఁ జం
పెను; దనుజాళి మ్రగ్గుటకు విస్మయమందుచు నిల్చియున్న
యా, దనుజలలాముఁ గాంచుచుఁ గ్రుధన్ హనుమంతుఁడు
హుంకరించుచున్. 665

క. వడిఁ జని పిడికిట శిరమునఁ
బొడిచెన్; దానన్ మనంబు పొంగకయుండన్
గడు జవమునఁ దనవాలముఁ
బొడవు గనం బెంచి యారిపుప్రభుఁ జుట్టెన్. 666

ఆ. అట్టె చుట్టి యాగ్రహంబు రూపంబున
నిలిచినట్లు శత్రువులకుఁ దోఁచు
చున్నతనువు గ్రాల నురుగతిఁ బలుసార్లు
త్రిప్పి త్రిప్పి యంబుధిం బడంగ. 667

సీ. వైచె; నంతట మాల్యవంతుండు జలనిధిఁ
బడి చావుతప్పె నొప్ప దిఁక యుద్ధ
మీతనితో నని హితమతి నాత్రోవఁ
బాతాళమును జొరఁబాఱె నంత;
హతశేషు లగునిర్జరారులు తమనాథు
పాటుఁ గన్నులఁ జూచి భయము గదుర
నెవరికిఁ దోఁచిన ట్లెల్లెడలకుఁ బాఱె;
రాచరిత్రముఁ గాంచి యమరు లంబ

ఆ. రమునసుండి పొగడి రమలవాక్కుల నిట్టి
వీరు లోకమందు వెదకి చూచి
నను గనంగఁ గలమె హనుమయే శూరుండు
ధీరుఁడు నగు నిజము త్రిభువనముల. 668

క. గిరితో నీతఁడు దానవ
వరు లడ్డపడంగ భూరివారిధినడుమన్
దుర యొనరించుటె కాదు
ద్ధురశక్తిం బరులనెల్లఁ దోలెన్ బళిరే. 669

క. అని వినుతించుచు నుండఁగ
హనుమయు శ్రీరాముఁ గనెడు నాతురమునఁ గొం
డను గొంచుఁ బోవ నయ్యది
ఘనరశ్ములఁ బొలుచులతలు గలుగుట కతనన్. 670

క. హరిదశ్వుఁ డుదయభూధర
వరశృంగము నెక్క నన్నవడువునఁ దోఁచెన్;
ధరణీశుఁ డంతఁ బ్రియసో
దరుఁడు ధరం బవ్వళించి దానవుశక్తిన్. 671

క. తనువెల్ల రక్తధారల
మునుఁగన్ శవ మట్టులుండ భూభ్రము తేఁబో
యినహనుమయు రాకుండఁగ
నినుఁ డుదయాచలము నెక్కె నిదె యని వగచేన్. 672

రాముఁడు లక్ష్మణునికై శోకించుట.

క. కనులశ్రుజలౌఘంబున
మునుఁగన్ సౌమిత్రి యుద్ధభూమిం బడియుం
డినచోప్పు మరలమరలం
గనుఁగొని గద్గదరవంబు గలవాక్కులచేన్. 673

క. విలపించెను; సౌమిత్రీ
గలఁడే నీయట్టితోడు త్రైస్థలి నెందున్
గలనంబడి లిట్టులు నను
నిలవదలి దివంబుచేర నేగితి వకటా. 674

క. నను నమ్మి బంధుమిత్రుల
వనితామణిఁ దల్లి వదలి వచ్చితివి కదా
నినుఁ గాపాడంజాలని
జనునిన్ నను సోదరుఁ డనఁ జనునె కుమారా. 675

క. ఆపత్కాలంబున నెవఁ
డేపారెడుశక్తి సాయ మింతయుఁ జేయన్

జూపట్టఁడో యాతం డెటు
లాపద్బంధువుఁ డనంగ నవనిం జెలఁగున్. 676

క. నీవంటిసహజధార్మికుఁ
బావనమతి సహజు నార్తపాలకు ననిలోఁ
గావంజాలని నే నెటు
భూవిభుఁ డని చెప్పఁబడుదుఁ బూతచరిత్రా. 677

క. వనమున నకటా! ప్రేయసి
దనుజుఁడు కొనిపోయె యుద్ధధరణిన్ సహజున్
గొనిపోయెఁ గాలుఁ డింకే
మని జీవంబులనుగ్గూడి యవనిన్ నిలుతున్. 678

క. నాపౌరుషంబుఁ గాల్పనె
యీపట్టున శత్రుశక్తి యొసఁగం గనఁగా
నోపితి ధిగ్ధిగ్ధిక్కని
చూపరులన సంతసింపఁ జూచుటయె తగున్. 679

క. పరుశక్తి సుమిత్రాత్మజు
నురమున గాడంగరాఁగ నుద్ధతిమై స
చ్ఛరముల దానిం ద్రుంపక
ధరణిం దగు నేను శూరదస్యుఁడ నైతిన్. 680

క. అకటకటా! సౌమిత్రిని
సకలగుణాఢ్యుం గృపాళు శాత్రవభయదున్
వికపటమతి నే నెవ్విధి
నిఁకఁ జూడంజాలువాఁడ నీధరణిపయిన్. 681

క. నాకున్ భూజాతకు నే
యేకడల నదెట్టిసేవ లెవ్విధిఁ జేయన్

సాకల్యసుఖం బొప్పనొ
యాకరణిం జేయఁగాదె యనుజుఁడు ప్రీతిన్. 682

చ. పురమును మాని నట్టడవిఁ బూన్కి వసింపఁగ వచ్చువేళ సో
దరుఁ డగులక్ష్మణుండు తనధర్మ మెఱింగినవాఁడు గాన సుం
దరి విడనాడి తల్లి యనుతాపము నొందఁగ నూఱడించి నా
పరిసరమందె యుండఁ దమివచ్చె; నతం డిటఁ జచ్చె నక్కటా!

సీ. నవమాసములు మోసి నాకన్నకొమరుని
నీ కప్పగించెద నీవె వీని
కన్నవు జనకుండ వగుదువు భూజాత
యగుఁదల్లి నీదండ నమరియుండ
నేభయంబును గల్గ దేను నిర్భయముగ
నీరాకనెన్నుచు నిన్నె నమ్మి
యిట నుండుదాన నోయినకులాభరణంబ
యని తనపుత్త్రుని నప్పగించెఁ
ఆ. గాదె యాసుమిత్ర కడుఁబావనచరిత్ర
నేను బురికిఁబోవ నిన్ను నమ్మి
పంపినట్టి నాదుపట్టి యెచ్చట నున్న
వాఁ డటన్న నేమి పలుకువాఁడ. 684

చ. నిను నెదనమ్మి పంపిన యనింద్యచరిత్రుని నాకుమారుఁ గా
ననమునఁ జంపినావుగద నాయన! శూరశిఖామణీ! యటం
చును వగ నాపఁజాలకయె శోభనగాత్రి సుమిత్ర యేడ్వ నే
మని బదులాడఁజాలుదు జనాంతరమం దొకమేటిబంటనై.

క. భరతుఁడు శత్రుఘ్నుండును
ద్వరగాఁ జనుదెంచి నాదుదండ సుమిత్రా

వరసుతుఁడు లేమిఁ జింతం
దురపిల్లుచుఁ బ్రశ్న చేయఁ దోఁచునె పలుకన్. 686

క. తనయుల బంధువ్రాతం
బును భార్యను నెట్టిదేశముల నైనను బొం
ద నగునగాని సహోదరు
నిని బడయం దరమె యెవ్వనికి నే మరలన్. 687

క. దేనికిఁ జింతింపను గా
నీ నేను విభీషణుని మనీషిని విలస
న్మానసుఁ గూర్చియె దుఃఖం
బూనెద నాతండు ధీరుఁ డుత్తమగుణుఁడున్. 688

క. ఋతవచనుండు మహాత్ముం
డతులిత తేజః ప్రకాశుఁ డాదృతిపాత్రుం
డితరాధృష్యపరాక్రముఁ
డితనికి నీతండె సాటి యిల లేఁ డొకఁడున్. 689

క. బలవంతుఁ డైనసోదరు
నలఘుధనాఢ్యునిసురాధిపారివిభుని ని
స్తులపౌరుషు దుర్గుణుఁ డని
తలపోసియె విడిచి నన్నుఁ దమిఁగూడంగన్. 690

క. చనుదెంచి శరణుచొచ్చెను
మన మూఱడిలంగ నేను మన్నించి మహా
దనుజాధిరాజ్యమున కీ
వె నృపతి వని పల్కినాఁడ నిదియెటు సాగున్. 691

క. అరుదెంచు చున్నవాఁ డిదె
సరసిజబాంధవుఁడు మిత్రసంజ్ఞుం డయ్యుం

బరికింప నా కమిత్రుఁడె
తరుణంబున నిందు నయ్యె దైవవిముఖతన్. 692

చ. సరసిజబాంధవుండుదయశైలము నెక్కెడుజాడతోఁ జెడున్
మరుదధినాథు నాత్మజుఁడు మామకభక్తుఁడునయ్యు నేటికో
ధరణిధరంబుఁ గానఁ జని దైవవశంబునఁజిక్కెనో మఱే
వరుసనొరాఁడు లక్ష్మణునిప్రాణము లుండవిఁకేమిచేయుదున్.

క. శరణన్న వారిఁ గాచుట
ధరణీశులకృత్య మౌను దత్కృత్యం బీ
తరుణమునఁ జేయఁజాలను
భరతునిఁ గనఁబోయి నాదుపల్కులు గాఁగన్. 694

క. వినిపింపు మోవిభీషణ
యనుజా! లంకాధిరాజ్యమం దీతనిఁగూ
ర్తు నటంచు బాసచేసితి
ననుజునిచింతన్ మునింగి యలమటపడుచున్. 695

ఆ. చేయఁజాల నైతి నీయెడ నీ వయో
ధ్యకును బట్టభద్రు నాదరమునఁ
జేసి నాదుమాటఁ జెల్లింపు మని నేనుఁ
బల్కినట్లుగాఁగఁ బలుకవయ్య. 696

క. ఆతఁడు నామాటకు బదు
లేతత్రినేఁ జెప్పఁ డనుచు నెఱుఁగు మనుచు నా
భూతలనాథుఁడు పల్కుచుఁ
జేతోదుఃఖమ్ము మిగులఁ జేడ్పడియుండెన్. 697

క. పదపడి సుగ్రీవునిఁ జూ
చి దగం దొట్రిలెడు నుడులచే నిట్లనియెన్

విదితంబుగాదె నీ కి
య్యదనున సాగినవిపత్తు హరిలోకేశా. 698

క. కనుకఁ నిర్భాగ్యునిఁ జే
రినదాన ఫలంబులే దరిద్రజకాలా
చను మిఁక నంగదుఁ గొని ప
త్తనమునకుఁ సైన్యసంయుతంబుగఁ దర్లఁగన్. 699

క. ఏయేకార్యము లొనరుప
నీయెడ కేతెంచితిమొ యవెల్లఁ వృథయై
పోయెం గావున నూరక
యీయధముని గూడియుండ కేగుము మిత్రా. 700

క. రాముని రక్షింపం దగు
నేమెయి నే ననుచు మీర లెంచితి రది యీ
రాముఁడు నిర్భాగ్యుం డగు
చేమాడ్కి ఫలించు నగవ నేటికి నింకన్. 701

క. దనుజులమార్గోనకుండఁ గఁ
జనుఁడీ మీ రెల్ల నన్ను సత్వవిహీనుం
గనుచుఁ నిల్వక యనఁగా
విని సుగ్రీవుండు దుఃఖవిషధిఁ మునిఁగెన్. 702

క. మునిఁగియు మెల్లన ధైర్యముఁ
గొని యిట్లని పల్కె భూపకుంజర! యి ట్లీ
వనఁ జన్నె ప్రభాతం బిం
కను జూర దీజాము తుర్యకం బగుఁజుమ్మీ. 703

ఆ. యామమాత్ర మింక నవధి సూర్యోదయ
మునకుఁ గలదు పవనతనయుఁ డింత

లోన రాకమానఁ డా నిలింపులు విఘ్న
మాచరించినను నహోర్యశక్తి. 704

క. జననాథా! వగవంగాఁ
జనునే నీవంటిధైర్యశాలికి నేనే
మని నేర్పఁజాలువాఁడను
గనుమా లక్ష్మణుని మోముకాంతిన్ మగుడన్. 705

క. మృతిలక్షణంబు లేయే
గతులం దలపోసి కనినఁ గానంబడవో.
దితిజాంతక! వగపుడుగుము
క్షితి లక్ష్మణుఁ డుండఁగలఁడు చిరకాలంబున్. 706

క. అనియెంత నొక్కిచెప్పిన
నినజునివాక్కులను సుంతయే వినకార్తిం
గనుచున్ రాముఁడు క్షితిఁబడి
కనజాలియె కలుగునట్లు గా విలపించెన్. 707

క. అనుజా! లక్ష్మణ! యనుచున్
నను నొంటిగ డించి చనుట న్యాయమె యనుచున్
నినునమ్మి వనికి వచ్చితి
ననిద్రైనఁ దలంప వకట యనుచున్ వగచెన్. 708

క. పదునాల్గువత్సరంబులు
నిదురను నాహారమును వినీతి వదలి న
న్నుఁ దగం గొల్చినపుణ్యుఁడ
వు దైవగతి జిక్కి యుద్ధభూమిఁ బడితివే. 709

క నను నమ్మి వనములకుఁ బం
చినతల్లికి నేమిచెప్పఁ జెల్లునో వానిన్

వినిపింపకయును దివికిం
జనితివె సహజన్మ సాధుసద్గుణనిలయా. 710

క. అని మఱిమఱి పలవించుచుఁ
గనుయుగ్మము నీటమునుఁగఁగా దీనుండై
తను దూఱుకొనుచు వగచెడు
జననాథునిఁ జూచి దుఃఖసంతప్తుండై. 711

క. హరిపతి చేరం జని యో
ధరణీశా రాత్రిగలదు తపనుం డింకన్
గిరిపైకి రాఁడు హనుమయు
నరుదెంచు సుమిత్రపట్టి యార్తియుఁ దొలఁగున్. 712

క. చింతింపం బనిలే దిఁక
సంతసమున లక్ష్మణునివిశాలభుజుని దు
ర్దాంతపరాక్రముఁగూడి ని
శాంతమునన్ దానవులను జంపుట యొప్పున్. 713

క. అనునంతలో సదాగతి
తనయుం డమ్మాల్యవంతు దర్పముఁ బోకా
ర్చి నిజశిరంబున ద్రోణా
ద్రిని దాల్చి రఘూత్తమునిపరిసరము చేరన్. 714

క. చనుదెంచుచుండె నాగిరిఁ
గన నగుజ్యోతిర్లతాప్రకాశము సూర్యం
డనఁ జొచ్చె దానిఁ గనుఁగొని
జననాథుఁడు తీవ్రకోపసంరంభుండై. 715

చ. హరిపతిఁగాంచియిట్లనియె నర్కునిఁజూపుచువీనిఁగాంచి తే
గురువన నాదువంశమునకుం దలపోయఁగ నీతఁడే కదా

పరమదురాత్ముఁడై మదరిపక్షముఁ బూని యితండు నాదుసో
దరు మృతినొందఁ జేసెడువిధంబునఁ దోఁచె నిఁకేమిచేయు
దున్. 716

చ. అనుజుఁడు ప్రాణయుక్తుఁ డగునంచు రిపూత్కరముల్
రణాంగణంబున వడిఁ ద్రుంతు నంచు నినుఁబోలెడు మిత్రుని
హర్షవార్థిలో, మునుఁగ నొనర్తు నంచుఁ గడుమోదము
నొందుచుఁ గొండఁ గొంచుఁ బా, వని యరుదేరఁ గాంతు
నని వంత దొలంగెడునన్ను నేచఁగన్. 717

క. అరుదెంచుచున్నవాఁ డిదె
తరణి సఖా! చూడు మితనిదర్పం బనుచున్
హరిపతికిఁ జూపి క్రోధ
స్ఫురణమునం గన్ను లరుణశోభఁ బ్రబలఁగన్. 718

క. కరయుగము కంప మొంద న
ధర మల్లలనాడ మోము దారుణరీతిం
బరికింపం గనుపట్టఁగ
శరచాపము లంది తీవ్రసంరంభుండై. 719

చ. కను మిదె యీదురాత్మకుని కావరమెల్ల నడంచువాఁడనా
ధనువుననుండి ముక్తమగుదారుణబాణము వీనిగాత్రముం
దునియలుచేసి యంబునిధితోయములందు మునింగి వచ్చు,
నా, కును శుభవార్త దెల్పుటకుఁ గూళనునిట్టులె చేయఁగాఁ
దగున్. 720

చ. శరము మదీయకార్ముకవిశాలదురాసదలస్తకచ్యుతం
బరిగి మహేంద్రునేని జలజాయతలోచనునేని మృత్యువుం

భూరిగొను శంభునేని జగముల్ రచియించెడు బ్రహ్మనేని భీ
కరయమునేని భీతిఁగనఁగా నొనరింపక రిత్త రాదు సూ.

చ. నను నొకమర్త్యమాత్రుగ మనంబున నెంచినవాఁడొ
యేమొ యీ,వనరుహబాంధవుం డగుభవజ్జనకుండు హరీశ!
చూడు మిా!,వని మొనఁజూప మూని త్రిపురాంతకుపోలిక
నిల్చి భస్మమై, వననిధిలోపలం గలియుభంగి నొనర్తును లోక
సంతతిన్. 722

చ. దితిజునిగుంభకర్ణు నతిధీరులఁ దక్కఁగలట్టివారి ను
ద్ధతిమెయిఁ జంపి మించినప్రతాపమునం జెలరేఁగు నాకు నీ
దితిజవిభుండు రావణుఁడు తీవ్రమయూఖుఁడు నీదుతండ్రివి
ఘ్నుతతిని గల్గఁజేయు సురకాంతవిరోధిగణంబు లెక్కయే.

చ. కనుఁగొనుమా హరిప్రవర! కార్ముక మియ్యది ఘోరభంగి
గాఁ, గనఁబడుచున్న దీవిశిఖకాండము నిప్పులు గ్రక్కు
చున్న దీ, యనిమొనఁ గంజజాండముల నన్నిఁటి బాణమ
యాగ్నికీలలం, గొనకొని బూదిచేసి యిదె కొంకక సాగర
వారిఁ గల్పెదన్. 724

{ జాంబవంతుఁడు రాముని కోపము శాంతిల్లఁజేయుట. }

క. అని యిటు కోపావేశం
బునఁ బల్కెడు రామచంద్రమూర్తిం గని య
ల్లన జాంబవంతుఁ డిట్లను
మనుజేంద్రా! నీవు లేశమాత్రము కినుకన్. 725

క. మనమునఁ దాల్చినయంతన
నినుఁగానఁగఁ జాలకదె యనిమిషులు సాధ్యుల్

తనువులు వడంకఁబాఱెద
రనఘా! గతి యేది వారి కగునో తెలియన్. 726

క. దీనికి హేతు వెఱుంగమి
మానస ముద్విగ్నమయ్యె మహితాత్మా! భూ
జానీ! కోపం బేటికిఁ
బూనితివో సుంత చెపుమ బుద్ధి నెఱిఁగెదన్. 727

చ. అనుజునిపైనఁ గల్గినప్రియంబున నే మిది యంచు నెంచకా
త్రినిగనుచున్నవాఁడవు మదిం దలపోయవు తత్వ మిద్దియా
నని ముద మొందఁగాఁ దగినయట్టితఱిం బెనుకోప మూనఁ
గా, నను వగునే, మహాత్మ యుదయాద్రిపయిన్ రవిచేరె
నంచెదన్. 728

చ. తలఁచితి వేమొ నీపనుపుఁ దాల్చి శిరంబున నుత్తరాశ కు
జ్జ్వలగతిఁబోయి ద్రోణగిరివర్యముఁదెచ్చుచు నున్నవాఁడు
సూ, కలుషవిహీనుఁ డుత్తముఁ డఖండపరాక్రమశాలి
పండితుం, డలఘుగుణాఢ్యుఁ డెల్లపనులందును నేర్పఱి
సాధుభక్తుఁడున్. 729

క. వినయంబును గలయనిలుని
తనయుఁడు, తచ్ఛీర్షమున నితాంతముకాంతిన్
దనరారు లతలనొప్పిన
ఘనగిరి యదిగాని రవియుఁగాఁడు మహాత్మా. 730

క. క్షితిపతివర్యా! జ్యోతి
ర్లతలను విఖ్యాతితోఁ జెలంగుచుఁ దమకుం
బ్రతిలేనియోషధులు నీ
దుతమ్మునకుఁ బ్రాణ మీయఁ దోఁతెంచెడుఁ జూ. 731

క. వానిమహాత్తరకాంతులె
భానునిబింబంబుతోఁచుపగిదిఁ గనఁబడం
గా నీవు సూర్యుఁడే యని
మానసమున నెంచి యిట్టిమాటల నలుకన్. 732

క. కనఁబఱచితివో రామా!
హనుమంతుం డదిగో శీర్షమం దద్రివరం
బును గొనివచ్చుచు నున్నాఁ
డనుమానము వీడి కపుల నతని కెదురుగన్. 733

క. పనుపుము నావిని రఘుకుల
వననిధిచంద్రుండు రామభద్రుం డంతన్
వనచరులం గని యెదురుగఁ
జనుఁడీ యని పలుకఁ గీశసత్తము లంతన్. 734

క. కిలకిల నార్చుచు నెదురుగఁ
బలువడిఁ బోవంగ వారిఁ బ్రమదంబున ని
మ్ముల గాంచి పవనసూనుం
డలఘుజవం బొప్ప రాముఁ డలరారంగన్. 735

చ. అనుపమశైలముం గొనుచు నంబరభాగమునుండి వానరుల్
కనుఁగొని సన్నుతింప దిగి స్థాసలిఁ బర్వత ముంచి రామచం
ద్రునిఁ గరుణాంబురాశిఁ గని తోరపుభక్తిని జేతులొగ్గి మ్రొ
క్కి నిలిచి యిట్లనెన్ విమలకీర్తియుతా రఘువంశభూషణా.

చ. అనుమతినొంది తావకపదాంబుజముల్ తలపోయుచున్
వెసం, జని యలద్రోణపర్వతవిశాలతటంబుల దివ్యకాం
తులన్, గన నగునోషధుల్ గనుచు గ్రక్కున డగ్గఱ నవ్వి

యచ్చటఁ, గనఁబడకుండె నేమి యికఁ గార్య మటంచు
దలంచి తెంపునన్. 737

చ. సురలకు మ్రొక్కి యుష్మదభిశోభితనామము సంస్మరించి భూ
ధరమును వేఁడి శీర్షమునఁ దానిని నిల్పి తదీయరక్షకో
త్కరమరుదేరఁ జెండి వడిఁ గాఁజను దెంచుచునుండు నంత నం
బరమున నబ్ధిమధ్యమున బాలిశుఁ డా దనుజుండు ప్రాన్కి
తోన్. 738

మ. బలయుక్తుం డయి నన్ను నిల్పి గిరినీవారాశిలో వైవు మి
మ్ములఁ గొంచుం జన నీకు శక్యమగునే మూర్ఖా బదుల్పల్క
నీ, జలరాశ్యంతరమందుఁ జంపుదు నన్ సంగ్రామకౌతూ
హలం, బలరం దోఁకను వానిఁ దద్బలము నుదగ్రత్వొరుషం
బొప్పఁగన్. 739

ఆ. కట్టి విసరివైచి కడువడి వచ్చితిఁ
ద్రోవ విఘ్నము లిటుతోఁచెఁ గొన్ని
దాన నుంతకాల మేనుబుచ్చితి దాని
సైపవలయు ననిన క్ష్మాపతియును. 740

మ. కనులం దప్పుడు మోదబాష్పకణముల్ క్రమ్మంగ నప్పావ
నిం, గని రావయ్య! కృపానిధీ! యనుచు నీకారుణ్యపీయూ
షయు, క్తిని గాకుత్థ్సకులంబు భూమిఁదగి సత్కీర్తిం గనెన్
మన్ననం, బనఘా! మోదసముద్రవీచికలపై నాశ్వాసముం
గాంచెఁ జూ. 741

మ. సురలైనన్ సురవర్యులైన నగునే చూపంగ నీలాటి దు
స్తరకార్యంబున సాహసం బిటులు; స్తోత్రం బిద్ది కాదో
కృపా, కర! నిన్నెన్నఁగఁజాల నీదుకరుణం గాకున్న నాదే

హ ము, ర్వర నిల్వంగలదే సహోదరుఁడు లేవం జాలునే పావనీ. 742

క. అనిపలుకుచు మోదంబున
హనుమంతుం జేరఁ దిగిచె నంత హరీశుం
డును వేగ సుషేణుని గ
న్గొని యార్యా! వెదకు మింకఁ గొండఁ లతలన్. 743

క. కాలంబు చెల్లకుండఁగ
నీలక్ష్మణుఁ బ్రాణయుక్తి నెసఁగంజేయం
బోలును నాఁగ సుషేణుఁడు
శ్రీలలనాధిపుఁ దలంచి శీఘ్రము కపులన్. 744

వ. కొందఱం గలిపికొని యప్పర్వతవరం బధిరోహించి యందుఁ దా మున్నెఱింగినపుణ్యస్థలంబులం గాంచి ముదమంది వానరులకుం జూపుచుఁ బుణ్యతరంగిణీజలంబుల దర్శించి నమస్కరించుచు, నుద్దండగండోపలంబుల వీక్షించి వానిలంఘించుచుఁ బావనభూరుహసందోహంబుల దిలకించి మెచ్చుచుఁ, దత్తటంబులం దిరిగి తిరిగి యేరికేఁ జేరరాక వేవేగ యొండుకడఁ గనంబడుశక్తిందగి జిగిబిగివెలయుచు, మహత్తరదీప్తులం జెలువారుచు, నసదృశసామర్థ్యంబునఁ దేజరిల్లుచు, నప్పర్వతసానువుల నున్ననోషధివరంబులఁ దా మున్ను సురవరులవలనఁ గన్నశక్తిం బరికించి వానిం బూజించి ప్రార్థించి సంగ్రహించి యసమానజవంబున నప్పర్వతంబు దిగి శ్రీరామచంద్రునిఁ జేరం జనుదెంచి, రణభూమిం బరుండియు ముఖకాంతిఁ దప్పక శయనించువానిం బోలియున్న సద్గుణశ్రీలు లక్ష్మణుం జూచి వగచుచు నింతధైర్యంబునఁ గను.

పట్టుచున్న భూరమణు వంతఁబాపం దలంచి విధియుతంబుగ సౌమిత్రియం దాయోషధివరంబులం బ్రయోగించె నప్పుడు.

వ. తనువున నాటియున్న యతిదారుణబాణము లట్టి యూడి మే, దినిబడె రక్తసిక్తమయి తీక్ష్ణముగాఁ గనుపట్టుమేను చ క్కనిగతిఁ జూడనొప్పె, మృదుకాంతిని మోము చెలంగెఁ బ్రాణముల్, తనువున నిల్వఁగోరినవిధం బపు డెల్లరయూహ లం దగెన్. 746

ఉ. మోము కలంతగానిశరముల్ కడునాటుట రక్తపూరముల్ వేసులుసాగినట్టి వగు వింతవ్రణంబులుగాని విస్మృతిక్ భూమిని ద్రెళ్లినప్డు వపువుక్ వెసఁదూఱిన ముండ్లుగాని యా, రామునితమ్ము నందుఁ గన రావొకకొన్నియుఁ బాఱఁ జూచినన్. 747

ఉ. హాయిగ నిద్రవోయి ప్రమదాంబుధిఁ దేలుచు బంధువర్గమే చాయనొ దృష్టినిందగుల సంబరమొప్పఁగఁ జేరఁబోవు న ట్లాయెడ లక్ష్మణుండు స్మృతియ ట్లలరారిన, వంతఁ గుందు చుం, జేయఁగ నేమితోఁచనటు చేడ్పడియుండిన రామచం ద్రునిన్. 748

ఉ. వానరులెల్లఁ దన్గొలిచి వచ్చుచునుండఁగఁ బ్రీతిమీఱఁగాఁ గానఁగఁబోయి దివ్యపదకంజయుగంబున మౌళిఁజేర్చినక్ మేనుచెమర్ప లక్ష్మణుని మిక్కిలిప్రీతిని గౌఁగిలించుకొం చూనినదుఃఖవేగమున నూరకయుండె రఘూత్తముం డటన్.

చ. కను లొాగి నీటముస్గ ముఖకాంతియుఁ గ్రొత్తవిధంబుఁ దా ల్చియే, కనఁబడుచుండ హస్తములు కంపము నొందుచు నుం డఁ దాపముం, గని హృదయంబు చంచలతఁ గాంచఁగ రా

మునిదేహ మప్డు మా, తనరుచిఁ గ్రాలె దాని కదె తాల్చెను
సామ్య మదెట్లు చూచినన్. 750

చ. అనుజునిపైనఁ బ్రేమ మన నట్టులె యుండవలెఁ ధరాతలం
బున నని సజ్జనుల్ పలుకఁబోలువిధంబుననుండె; నాస్థితిం
గనఁ దగునట్టివారలె తగఁ సహజప్రియభావముఁ బూన
నర్హు; ల, ట్లనుపమరీతిఁ బొల్చి కపులందఱుఁ గన్గొనుచుండ
లక్ష్మణున్. 751

క. తనయంకంబున నిడుకొని
కనుదమ్ములనుండి ధారగాఁ గాఱు జలం
బున నాతమ్మునిఁ దడుపుచు
మనుజేంద్రుం డిట్లుపల్కె మ్రాన్పడు నుడులన్. 752

క. అనుజా! మృదువాక్యంబుల
మన మూఁటడిలంగఁజేయు మనవైరుల నిం
కని మొనఁ ద్రుంచెద మోదం
బును గనఁగాఁజేయువాఁడఁ బూనిక మీఱన్. 753

క. తను విడి కర్కశరిపుశ
క్తిని దూలి రణాంగణమునఁ ద్రెళ్లిం గాదే
యనుజా! యెంతటియార్తిం
గనినాఁడవొ నిన్నుఁ బ్రాణకలితుం జేయన్. 754

క. తనమోపినంతవట్టును
హనుమ ప్రయత్నించె నితనియత్నంబుననే
తనువిడి నిల్చెను నేనుం
గనినాఁడను బ్రదుకు; నీడుగలదె యితనికిన్. 755

సీ. అనిపల్కు-చుణ వాయుతనయుని వీక్షించి
యుద్ధభూమినివైరియుగ్రశక్తిఁ
బడిన నాతమ్ముని బ్రదికించినాఁడవు
దాన నాదేహ మీధరణి నిలిచె
నిక్ష్వాకుసద్వంశ మిల నలరారెను
నీవంటిమిత్రుండు నిన్నుఁబోలు
బంధువు నీవంటిపావనచిత్తుండు
నీవంటిభక్తుండు నిన్నుఁబోలు
తే. శూరవర్యుండు గలఁడె యీక్షోణియందు
స్తుతులుకావివి నిక్కపుశ్రుతులెగాని
పరుల కుపకృతిజేయంగఁ బాటుపడెడు
వారియం దెన్న మొదట నీపేరె చెల్లు. 756

క. హనుమంతా! యీయుపకృతి
కిని బదులుగ నెట్టిది యుపకృతి చేయంజా
లను జొమ్ము ప్రాణబంధుం
డను పల్కన కీవె లక్ష్య మనఁదగు నిలలోన్. 757

క. బదులే నొనరుపఁజాలం
గద నీ కిఁక నాపద లెటుగల్గవు నాయు
స్సు దగుం గోరినయట్టులు
ముదమారఁగ నుండుమీవు భూమిసతంబున్. 758

చ. అనుపమసద్గుణాకరుఁడ వంచుఁ గృపానిధి వంచు శూరలో
కనికరభీతికృత్ప్రబలకర్బురజేత వటంచుఁ గీర్తినిం
గనుము మహాత్మ! కష్టములు గల్గవు నీ విఁక నీదుఖ్యాతి మే
దిని గులశైలభానుహిమదీధితు లుండెడుదాఁక నుండెడున్.

క. నినుఁ జింతించినమాత్రన
మనుజులయాపద లవెల్ల మాయున్ నీపే
రను భగవన్నామమువలెఁ
దనరారున్ లోకమందుఁ దథ్యము వత్సా!. 760

క. అనిపలికి సుషేణుని గ
న్గొని మోదం బలర నాదుకూర్మియనుజునిన్
ఘనతరలతామహత్త్వం
బున బ్రదుకంజేసితీవు పుణ్యమనీషా. 761

చ. నినుఁ గొనియాడనేర నిఁక నెమ్మిఁ జెలంగుము చాలకాల మీ
వని పరిరంభణంబున మహాముదముం గనఁ జేసి తమ్మునిం
తనివచియింపరాని దయ నారఘువంశవిభూషణుండు చ
క్కనినుడులం బ్రమోదయుతుఁ గానొనరించెననంతరంబునన్.

తే. రామునానుమతిచే వానరవ్రజంబు
బ్రదుకఁ జేసె సుషేణుండు ప్రబలశక్తి
నలరునోషధులను గొని యంత నిద్ర
నుండి లేచినగతి వార లొప్పి రెలమి. 763

చ. పనివడి యాసుషేణుఁ డలపర్వతవర్యము పెంపుదెల్ప నా
జనపతి వానిఁ గూడి పృథుసానుతలంబుల సద్గుహావళిం
గనుఁగొని మోదమంది బహుకమ్రఫలంబులఁ దృప్తినొంది యా
ఘనగిరి దామహత్త్వమును గాదిలిసూక్తుల సన్నుతించుచున్.

క. తేనియ లానుచు వేడుక
వానరులం గూడి యందు బహువిధగతులన్
మానస మలరఁ జరించెను;
దానవులం బొలియఁ జేయు దర్పమ్మలరన్. 765

ఆ. ఇట్లు సంచరించి యినవంశతిలకుఁ డా
పర్వతంబు దిగుచుఁ బవనతనయుఁ
గాంచి యిట్లు లనియెఁ గమ్రగుణాఢ్య యీ
పర్వతంబు నీదుబలిమి గొనుచు. 766

క. చని పూర్వస్థలమందే
యునిచి మహాజవముమీఱ సుగ్రాంశుఁడు తూ
ర్పునఁ దోఁపకుండ రమ్మా
యనిసేయఁగ వలయుఁగాదె యసురుల మాపన్. 767

చ. దనుజులుకృత్రిమాంగములఁ దమ్మెరు లెవ్వరెఱుంగకుండనీ
వనధిసమీపభూముల నవార్యగతిం జరియించుచుందు రీ
ఘనలతలందు నైజముగఁ గన్పడుశక్తి నెఱింగి మృత్యువుం
గనిపడియున్న దానవులఁ గ్రమ్మఱఁ బ్రాణయుతింజెలంగఁగన్.

తే. చేయఁజాతురు గాన నీశిఖరతల్ల
జము యథాపూర్వముగ నిల్పి సరగరమ్ము
నాఁగ శ్రీరామచంద్రు నానతిని మౌళిఁ
దాల్చి శ్రీరామమూర్తి యుత్తమపదముల. 769

క. మనసునఁ దాలిచి పర్వత
మును మౌలికవోలె శీర్షమున నిల్పి జవం
బున వినువీథిని నుత్తర
మునకుం జని తొంటిచందమునఁ బర్వతమున్. 770

క. నిలిపెను; గంధర్వులు త
ద్బలసాహసములను జూచి పావని! నీతోఁ
దులఁదూఁగువారు లేరని
పలుకుచు నాశీర్వదింపఁ బవనతనయుఁడున్. 771

క. శిరమునఁ గరయుగళము భ
క్తిరతిం గీలొ్కల్పి వారిఁ గీర్తించి ధరా
ధర మొనరించినయుపకృతిఁ
బరమాద్భుత మంచుఁ దెలియఁబలుకఁగ దివిజుల్. 772

క. పరమప్రమోదమున న
మ్మరుత్తనూజుఁ గుణైకమహితుని దివిజే
శ్వరతుల్యవిక్రముని రఘు
వరకార్యరతాత్ముఁ గాంచి పలికిరి ప్రీతిన్. 773

హనుమన్నుతి.

క. వినుమా; సద్గుణగణ్యా
నిను నెవ్వం డస్మదుక్తనియతి వదలకే
దినదినము సన్నుతించునొ
కనఁ డాతం డాపదలను ఖ్యాపలి నెపుడున్. 774

క. తొలుత విరాడ్బీజం బ
వ్వల లక్ష్మీబీజయుక్తి భాసిల్లుచు ని
స్తుల బిందుశూన్య మగు శ్రీ
లలనాబీజంబు గల్గి లలితతమంబై. 775

క. సుందరపదాన్వితంబై
పొందుగ హనుమత్పదంబు పొల్పారఁగ నొ
ప్పం దగునమఃపదంబున
నందం బగుమంత్ర మిద్ది యలరుం జుమ్మీ. 776

క. హనుమత్పదమునుమాత్రము
ఘనతఁ జతుర్థీవిభక్తి కలితంబుగఁ గా

ర్చిన నద్ది మంత్రమై తగు
హనుమంతా! లేకయున్న నదియఫలంబౌ.  777

క. ఈమంత్రము గురుముఖమున
నేమానవుఁడేని భక్తి యొసఁగ శుభతిథిన్
నేమంబున నుపదేశము
శ్రీమహితముఁ బొంది జపముఁ జిత్తనియతిచేన్.  778

సీ. ఒక్కలక్ష యొనర్ప నురుపాపరాసులు
నశియించు వైరి సంతతి యడంగు
రెండులక్షలుచేయ నిండుమనంబునఁ
గోరిన యన్ని కోర్కెలు ఫలించు
మూఁడులక్షలజపమునఁ జిత్తశుద్ధియౌ
నాల్గులక్షలుచేయఁ గల్గువిజయ
మైదులక్షలు జప మాత్మశుద్ధినిజేయఁ
గరతలామలకమై గ్రాలు ముక్తి

తే. కోరికలఁ గోరకుండ నెక్కుడుముదంబు
వెలయ జపియింప సర్వకాంక్షలు ఫలించు
నిద్ది నీమంత్రజపవిధి యొఱిఁగి మేము
తెల్పితిమి మర్త్యులకు మేలు దీనఁగలుగు.  779

క. వినుమా మంత్రము జపియిం
పనుజాలని నరులకెల్ల భద్రము లొనఁగూ
డును నీనామజపంబును
వినుపింతుము పావనంబు విమలతరంబున్.  780

క. హనుమత్పవనాత్మజ పా
వననామద్వయము దీని వదలక నిత్యం

బును భక్తియుక్తి జపియిం
చిన నాపదలెల్లఁ దొలఁగుఁ జిత్తము చెలఁగున్. 781

సీ. సురకార్య మిట్లీవు శుభతమపద్ధతి
నొనరించితివిగాన నుర్వి నీదు
నామము సర్వజనములకు నుత్యమై
జప్యమై పాపాళిసమయఁజేయఁ
జాలినదై యొప్పుఁ జనునంచు మే మిట్లు
మంత్రంబు మఱినామమంత్ర మిట్లు
వరరూపమున నిప్డు ధర శాశ్వతంబుగ
నిల్పితి మనిపల్క నెమ్మి తనర

తే. సకల గంధర్వులును సిద్ధసమితి హనుమ
నాశిషంబులఁ దన్పిన నంత రాత్మ
మోదమునఁ బొంగ మస్తకమును దదీయ
పాదసన్నిధి నిల్పి సద్భక్తి తనర. 782

క. హనుమంతుఁడు వందనముల
నొనరించి మహాత్ములార! యుత్తమతమమా
ననఁదగినవరము నిచ్చితి
రనుకంపకు మేర గలదె యారయ నెందున్. 783

క. త్వర వేగవలయు శ్రీరఘు
వరుపాదసమీపమునకు వచ్చినకార్యం
బురుతరభవదాశీస్తతి
కరమరుదుగఁ బండె సెలవు కైకొందు నిఁకన్. 784

క. అని ప్రార్థించి మహాత్ముల
యనుమతిఁగొని యంబరమున నవలీలఁ జనె

దనుఁ గని దివిజులు హర్షం
బునఁ దేలుచుఁ బుష్పవర్షమునఁ గయిసేయన్. 785

తే. ఒకముహూర్తార్ధమునఁ బోయి యుర్వినాథుఁ
గాంచి వందనములఁ జేయఁ గౌఁగిలించు
కొనియె గంధర్వు లొసఁగినఘనవరములఁ
దెలుప శ్రీరాముఁ డానందజలధి మునిఁగి. 786

క. పలికెన్ హనుమా! గంధ
ర్వులు పల్కినదెల్ల నిజమవున్ మఱి నాయీ
పలుకున్ వినుమా! యెవ్వం
డిల నాపత్కాలమందు నెంతయు భక్తిన్. 787

క. నీనామము జపియించిన
నీనుతులఁ బఠించినన్ గిరీశుఁడు కోపం
బూనినఁ గ్రూరులు చెడుగతి
గా నిఖిలాపదలు తూలుఁ గడుశీఘ్రముగన్. 788

క. తలఁచిన శుభకార్యంబులు
ఫలియించున్ నీదు నామపారాయణమున్
లలి నొనరించు మహాత్ముఁడె
చెలఁగున్ మద్భక్తుఁడగుచుఁ జిరకాలంబున్. 789

ఆ. వేయిపల్కు లేల విశ్వంభరన్ నీదు
నామమంత్రజపము నరులకెల్ల
వాంఛ లొసఁగుచుండుఁ బావనీ! యిదె వర
మిచ్చినాఁడ నాత్మఁ దృప్తి మెఱయ. 790

క. అనిపలుక దేవతలు మిం
చినవేడుక సంబరమునఁ జెలఁగుచు నట్లౌ

హనుమన్నామము శ్రీరా
మునివాక్యమురీతి మంత్రముఖ్యం బగుచున్. 791

క. అనిశము కాంక్షాప్రదమై
జనులకుఁ బ్రాణప్రియంబు సకలాపన్నా
శనచణము ననుచుఁ బల్కఁగ
విని పావని యిట్లుపల్కె వినతుం డగుచున్. 792

క. శ్రీరామా! నానామం
బారూఢిగ భూమి వెలయుటను నది యుష్మ
త్కారుణ్యఫలము సత్పద
సారసయుగళార్చనైకసాంద్రఫలమునా. 793

క. నే నెంతవాఁడ ననియెన్;
వానరు లవ్వాక్యములకుఁ బరమానందం
బూనిన మదితోఁ బావని
తో నిట్లని పల్కె రింపుతోఁ దగునుడులన్. 794

క. వనచరకులమున కెల్లన్
జనియించెం గీర్తి రామచంద్రాంఘ్రిసరో
జనియతరతచిత్తుఁడవయి
తనరెడు నీవలన భూమితలమున హనుమా. 795

క. వినియుంటి మొకనివంకనె
తనరారున్ వంశమునకు ధన్యత యనుమా
టను నేఁడు చూడఁగంటిమి
మనములు సంతోషవార్ధి మగ్నంబులుగాన్. 796

క. సురవాక్యంబులు వినుటన్
బరమాద్భుతపుణ్యరాశి పావని యను నీ

సురుచిరకీర్తియె ముందట
శరీరముం దాల్చి నిల్చెఁ జంచత్కాంతిన్. 797

క. ఇదిగో కనుచున్నారము
సదమలయుష్మద్యశోవిశాలతనువు ; నీ
వుదయించినకారణమునఁ
గుదిరెఁ సత్కీర్తి కపులకులముల కెల్లన్. 798

క. ధన్యుండవు సద్గుణగణ
మాన్యుండవు నిన్నుఁబోలు మహితులు గలరే
వన్యఫలాశివె యయ్యు వ
దాన్యులలో నగ్రగణ్యతం గంటివి సూ. 799

క. అని యీవిధమునఁ బొగడుచు
వనచరు లత్యంతమోదవార్ధి మునిఁగి రా
ముని మ్రోల నిలువఁబడి రం
త నచట నిలుచున్నకపివతంసుల నెల్లన్. 800

క. కనుఁగొని శ్రీరాముం డి
ట్లనియెఁ భూలోకమందు నమరులవలె నీ
వనచరసంతతిపూజం
గనుచుండుంగాక సర్వకాలములందున్. 801

క. వనచరసంతతి నెవ్వరు
మనమున నించుకయు శంక మాని యమర్షం

గొని దండింతురో వారలు
గనుదురు బహుకష్టములను గలకాలంబున్. 802

తే. వంశవృద్ధియు నశియించు వారి కెపుడు
దొలఁగఁ జేయఁగరాని చింతలు పొసంగు
నిదియె నాయాజ్ఞ యని; మేదినీశచంద్రుఁ
డైన శ్రీరాముఁ డనుకంప నాజ్ఞ చేయ. 803

తే. అంబరంబున నున్న యయ్యాదితేయు
లట్టులే యగు శ్రీరాము లాజ్ఞ ననుచుఁ
బల్కి హనుమంతుసేవను బ్రస్తుతించి
రాముఁ గొనియాడి చనిరి పురంబులకును 804

చ. సురవరు లేగినంత రవిసూనుఁడు వానరవర్యులక్ష మహా
త్తరబలదర్పులం గలిసి తమ్మునితో రఘురాముఁ డొప్పఁ ద
త్పరిసరమందు మారుతిని బావనచిత్తుని నిల్పి ప్రీతితో
నిరుపమపుష్పమాలికను నిర్మలకంఠమునందు నుంచుచున్.

తే. శాశ్వతంబుగ నీభూమి సాధుకీర్తి
వెలయ జీవింపవయ్య నిర్మలయశోవి
రాజితా యని దీవించె; రమణజాంబ
వంతుఁ డట్లగుననెఁ గృపవర్ధిలంగ. 806

క. సౌమిత్రి బాష్పజలపూ
ర్ణామలనేత్రాంబుజాతుఁడై శుభభణితిక్ష

భూమిన్ శ్రీరామునికృప
నీమారుతి చాలకాల మెసఁగు నసమతన్. 807

ఆ. ప్రాణదాత యనఁగఁ బరఁగు నీహనుమయే
ధరణియందు ననుచుఁ బరమముదము
తనరఁ బలికె; నంత ధాత్రీశవరాళి శ్రీ
రాఘవుండు పలికె రమ్యభణితి. 808

క. హనుదివ్వజయము దీనిన్
ఘనభక్తిఁ బఠింప భక్తకాండంబునకున్
వినిపింప సర్వశుభములు
తనరున్ వ్యాధులు నశించుఁ దథ్యం బిదియా. 809

క. ఈపావనిమంత్రము నెవఁ
డేపారెడుభక్తిమీఱ నిద్ధమతిన్ దీ
క్షాపద్ధతి గురుముఖమున
నేపడసి జపింప నెల్లయిష్టము లమరున్. 810

క. అనిపలికి తమ్ముఁ గనుఁగొని
హనుమంతుం డీతఁడెన్న నాపద్బంధుం
డన నొప్పు నితనిఁ గాంచెద
మనుజులలో నుత్తమునిగ ననిరొం బ్రీతిన్. 811

ఆశ్వాసాంతము.

క. పురుషార్థచతుష్టయదా
నరతా వేదాంతవేద్యనామయుతా శ్రీ

కరరఘుకులసంజనితా
స్థిరగుణమహితా కృపాంబుధీ శ్రీరామా. 812

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణావాప్తగీర్వాణాంధ్ర కవితాప్రాభవ కాశ్యపాన్వయప్రభవ శ్రీ జనమంచి వంశాంబురాశికుముదినీమిత్ర సుబ్రహ్మణ్యమనీషిపుత్త్ర తాండవ కృష్ణాపరాభిధేయ శేషాద్రినామధేయవినిర్మితంబైన సంజీవ రాయవిజయ నామాంతరవిరాజమాన హనుమద్విజయంబు నందు సర్వంబు నేకాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.

---

## ప్రమాదపరిహారములు.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 10 | 10 | గనిసీయంచాడు | గనునిస్సీయన్న |
| 36 | 10 | కనుమువాఁడెయొ | కనుమయూతఁడో |
| 38 | 7 | డైనక | డేమే |
| 63 | 14 | సీచా | సీవా |
| 64 | 17 | నిశాధి | దిశాధి |
| 103 | 8 | షాలతీ | నువిదా |
| 104 | 14 | యట్టి | యిట్టి |
| 117 | 9 | నయ | దయ |
| 126 | 2 | కెగసిను | కెగసియు |
| 134 | 8 | దగ్గఱి | దగ్గఱి |
| 152 | 5 | సహజప్రియభావముఁ | సహజత్వముఁ |
| 157 | 16 | సర్వ | సర్వ |

ఇప్పటికిఁ గనఁబడినమార్పు లివ్వియే యని విన్నవించువాఁడను.

దను సంచరించు నీ,ప్రోడ రణావనింబడియెఁ బో విధిచేఁతకు
నేమి చేయనౌ. 129

మ. సకలాస్త్రంబు లెఱింగి ధీరుఁ డగుచున్ సంగ్రామరంగస్థలిన్
బ్రకటాత్యంతచమత్కృతిన్ ధనువునన్ శాతాంబకంబుల్
జవం,బు కడున్ మించఁగఁ గూర్చిశాత్రవతతిం బోకార్చు
నీలక్ష్మణుం,డకటా!తుచ్ఛపుశక్తిచేఁ బడియె నేమందున్ విధిం
గ్రూరునిన్. 130

మ. తనుఁగాపాడెడువార లేరయిన నిద్రాత్రింగలారే యటం
చనుమానించుచు దిక్కులం గనుచు దైన్యం బందుచున్నట్టి
యా, ర్తుని మాన్యుం గృప నివ్విభీషణునిదోడ్తో వెన్కకుం
జేర్చికొం, చు నయంబొప్పఁగ నిల్చినట్టి సుజనున్ శూరున్
విధీ! త్రుంచితే. 131

ఉ. ధర్మము తోడునీడవలె ధాత్రిని నిల్చి మనుష్యుఁ గాచు నా
నిర్మలసూక్తి యద్ది యతినీచము వ్యర్థము; ధర్మమూర్తి నాఁ
బేర్మి నెసంగు లక్ష్మణుని వృద్ధులసేవలఁ దన్పువాని స
త్కర్మరతున్ రణావనిని గావఁగ లేదన నేటిధర్మమో. 132

ఉ. కాచెడువారు లేనితఱిఁ గావఁగఁ జాలదు, వీరసంతతుల్
కాచెడునట్టు లున్నతఱిఁ గాచును ధర్మ మనంగఁ జెల్లుఁగా
యీచటులాంబకప్రతతు లెంతో వ్యర్థన్ దనుఁబొందఁజే
యుచో, నేచటు దాఁగియున్నదొకో యేనెఱుఁగంజుఁడి
ధర్మ మద్దిరే. 133

ఉ. మేటిమగండ నంచు తుటి మించెడుకీర్తిని గన్న నేను, మా
బోఁటు లిలాస్థలిం గలరె భూరిభుజాబలమందునంచొగిన్
మాటలుచెప్పు మీరు బహుమాన్యులు నుండఁగ లక్ష్మణుం